ప్రవేశ రుసుము లేదు



# చందమామ కేమెల్ రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**
**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు



ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.

పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:

పో. బా. నం. 9928 కొలాబా, బొంబాయి-400 005.

న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

పేరు : ------------------------------ వయస్సు ------------------------

చిరునామా : ------------------------------------------------------

------------------------------------------------------------------

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: *31—8—1982*

**CONTEST NO 25**

VISION Tel

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

**Results of Chandamama—Camlin Colouring Contest No. 24 (Telugu)**

*1st Prize:* Kola Samba Siva Rao, Poranki. *2nd Prize:* T. J. Bhaskar, Pakala-517 112. *3rd Prize:* M. K. Mohiddin, Rajahmundry-533 103. *Consolation Prizes:* Thakur Vijay Singh, Cuddpah-516 001. P. V. N. K. Anil Kumar, B. K. Agraharam. K. Raghu Babu, Madras-17. K. Kameshwara Rao, Berhampur. Geddam Venkata Ramana, Peddapuram.



# చందమామ

అగస్టు 1982



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-75

సంవత్సర చందా: 21-00

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''తోడు'']కు ఆధారం ''వసుంధర'' రచన.

ఫోటోవ్యాఖ్యలపోటీ బహుమతి మొత్తం పెంచదలిచాం. సెప్టెంబర్ నెల పోటీ ఫలితం నుంచి బహుమతి యాభై రూపాయిలు. అంటే, జూలై నెల ఫోటో వ్యాఖ్యలపోటీ నుంచి, యీ మార్పు అమలులోకి వస్తుంది.

## అమరవాణి

గంగా పాపం శశీ తాపం, దైన్యం కల్పతరుస్తథా,
పాపం తాపం చ దైన్యం చ, హంతి సజ్జనసంగతిః.

[గంగానది పాపాన్ని, చంద్రుడు తాపాన్ని, కల్పవృక్షం దైన్యాన్ని పోగొట్టగల వంటారు. కాని, సజ్జనులతో స్నేహం పాప, తాప, దైన్యాలు మూడింటినీ పోగొట్టగలదు.]

సంపుటి 71 ఆగస్టు '82 సంచిక 2

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00








# తెలివైన దొంగ

ఒకనాటి చీకటివేళ ముగ్గురు దొంగలు, తాము నగరంలో దోచిన డబ్బూ, నగలతో అరణ్యం చేరి, అక్కడ పాడుబడిన గుడిలోని విగ్రహం వెనక దాన్ని దాచి, నిర్భయంగా మండపంలో కూర్చుని కబుర్లు చెప్పుకోసాగారు.

మాటల మధ్యలో, వాళ్ళల్లో పెద్ద దొంగకు ఒక విచిత్రమైన ఆలోచన వచ్చింది. వాడు మిగతా యిద్దరితో, "ఒరే, నే చెప్పేది జాగ్రత్తగా వినండి! ఇప్పుడు మనం దాచిన ధనం తలాకాస్తా పంచుకుంటే మనలో ఎవడి దరిద్రమూ తీరదు. అలాకాక, మనలో ఎవరో ఒకరు మొత్తం ధనం తీసుకోవడం జరిగితే, వాడు యికముందు ప్రమాదకరమైన దొంగవృత్తి మాని, ఏ వ్యాపారమో చేసుకుంటూ హాయిగా బతకవచ్చు. ఏమంటారు?" అన్నాడు.

ఇందుకు వెంటనే దొంగలిద్దరూ సరేనన్నారు.

అయితే, దొంగిలించిన ధనమంతా ఎవరు తీసుకోవాలో నిర్ణయించడం పెద్ద సమస్య అయింది.

పెద్ద దొంగ కొంచెంసేపు ఆలోచించి, "ఇందుకు నాకొక ఉపాయం తోస్తున్నది. ఈ తెల్లవారుజాము లోపున, మనలో ఎవరికి ఆ దాచిన సొమ్ము సాయంతో కోటీశ్వరుడయినట్టు కల వస్తుందో, వాళ్ళకు దాన్ని యిచ్చివేద్దాం. ఈ ఆలోచన బావున్నదంటారా?" అన్నాడు.

మిగిలిన దొంగలిద్దరూ ఇందుకు ఒప్పుకున్నారు. తరవాత అందరూ నిద్రపోయేందుకు పడుకున్నారు. కాని, ఎవరికీ నిద్రరావడంలేదు. కొంతసేపటికి పెద్ద దొంగ తెల్లవారి తన మిత్రులకు చెప్పడానికి

వల్లూరు బాబురావు



ఒక కల ఆలోచించుకుని తృప్తిగా నిద్ర పోయాడు. రెండోవాడు కూడా తతిమ్మా యిద్దరికీ చెప్పేందుకు ఒక కల ఊహించు కుని కళ్ళు మూసుకున్నాడు.

మూడో దొంగ ఒక పథకం వేసుకుని, మిగిలిన యిద్దరూ నిద్రపోయేదాకా ఆగి, ధనం మూటను తీసుకుపోయి, దాపుల నున్న ఒక మర్రిచెట్టు తొర్రలో దాచి వచ్చి పడుకున్నాడు.

తెల్లవారిం తరవాత ముగ్గురు దొంగలూ మేలుకున్నారు. చిన్నవాళ్ళిద్దరూ అడిగిన మీదట పెద్ద దొంగ తనకొచ్చిన కల అంటూ యిలా చెప్పాడు :

"నేను మనం దొంగిలించి తెచ్చిన డబ్బంతా తీసుకుని, నేనెన్నడూ చూడని ఒక రాజ్యంలో ప్రవేశించాను. ఎక్కడ చూసినా చక్కని పైరు పంటలతో రాజ్యం సుభిక్షంగా వున్నది. కాని, విచారించగా ఆ రాజ్యంలో దొంగల భయం అధికంగా వున్నట్టు తెలిసింది. అందువల్ల, డబ్బంతా ఎక్కడైనా సురక్షిత ప్రదేశంలో దాచి, ఏదైనా వ్యాపారం చేద్దామనుకున్నాను. కాని, దురదృష్టవశాత్తు, ఆ రాత్రే డబ్బంతా దొంగలపాలయింది.

నాకు దుఃఖం ఆగిందికాదు. అప్పటి కప్పుడే పోయి రాజుకు చెప్పుకున్నాను. రాజు ఎంతో విచారపడిపోతూ, "నాయనా, నువ్వు పరాయిదేశం వాడిలా వున్నావు. నా దేశంలోని గజదొంగలను పట్టినవాడికి, నా కుమార్తెతోపాటు అర్ధరాజ్యం కూడా యిస్తానని చాటింపు వేయించాను. కాని, ఎవరికీ ఆ దొంగలను పట్టడం సాధ్యం కాలేదు.'' అన్నాడు.

రాజకుమార్తె, అర్ధరాజ్యం అన్న మాటలు వింటూనే, నాలో ఉత్సాహం పొంగి పొర్లింది. నేను రాజుతో, "మహా రాజా, విచారించకండి! నేను, ఆ గజ దొంగలందర్నీ పట్టి బంధించగలను.'' అని చెప్పాను.

దొంగను పట్టేందుకు దొంగే కావాలని పట్టినే అనలేదుగదా ! నేను క్షణాల మీద



దేశంలోని దొంగలందర్నీ పట్టుకుని, రాజుకు ఒప్పచెప్పాను. ఆయన అన్న మాట ప్రకారం రాజకుమార్తెను నా కిచ్చి చేసి, అర్ధరాజ్యం కూడా యిచ్చాడు. ఈ విధంగా మనం దాచిన సొమ్మువలన నేను కోటీశ్వరుణ్ణే కాదు, ఒక దేశానికే రాజును కాగలిగాను.''

రెండవ దొంగ మొదటివాడితో, ''ఫర్వాలేదు, ఒక మోస్తరుగా మంచి కలే కన్నావు!'' అని తన కొచ్చిన కల గురించి యిలా చెప్పాడు:

''నేను డబ్బూ, నగలూ తీసుకుని తూర్పు దీవుల్లో వ్యాపారం చేసేందుకు ఓడ ప్రయాణం చేస్తూండగా, ఓడ పెద్ద తుఫానులో చిక్కుకుని బుడుంగున మునిగిపోయింది. నేను డబ్బూ, నగలూ వున్న మూటతో క్షేమంగా నాగలోకం చేరాను. అక్కడ వున్న వజ్రాలూ, మణులూ చూసి నా కళ్ళు జిగేలుమన్నాయి. కాని, వింత ఏమిటంటే, నాగలోకవాసులు నా వెంటవున్న నగల పనితనం చూసి అబ్బురపడిపోయారు.

నాగలోకపు యువరాణి నాగదేవి, తన చెలికత్తెలను వెంటబెట్టుకుని వచ్చి, నగల్ని తన కిమ్మని అడిగింది.

ఆ క్షణంలో నా బుర్ర మహా చురుగ్గా పనిచేసింది. నేను నగలను నాగదేవికి యివ్వకుండా కొన్నిటిని ఆమె చెలికత్తెలకు బహూకరించాను. నాగదేవి తన చెలికత్తెలు తనకన్న అందమైన ఆభరణాలు ధరించడం చూసి ఈర్ష్యపడిపోయి, నా దగ్గిరకు వచ్చి, దీనంగా, ''నువ్వు ఏది కోరినా యిస్తాను. ఆ మిగిలిన నగలన్నీ నా కిచ్చెయ్యి.'' అన్నది.

ఆ మాట కోసమే ఎదురుచూస్తున్న నేను ఆమెతో, ''నాగదేవీ, నేను పుట్టి పెరిగిన దేశం వదిలి, ఎన్నో శ్రమలకోర్చి నిన్ను వివాహమాడేందుకు యిక్కడి కొచ్చాను. ఈ నగలన్నీ నీవే!'' అంటూ నగలన్నీ యిచ్చేశాను.

అన్నమాట ప్రకారం నాగదేవి అప్పటి కప్పుడే మహావైభవంగా నన్ను వివాహ మాడింది. ఈ విధంగా మనం దాచిన సొమ్ము వలన నేను నాగయువరాణిని వివాహమాడి, నాగలోకానికే రాజును కాగలిగాను.''

మొదటి యిద్దరి కలలూ విన్న మూడవ దొంగ విచారంగా ముఖం పెట్టి తన కల గురించి యిలా చెప్పాడు: ''మీ యిద్దరి కలలతో పోల్చితే అసలు నాది కలేకాదు, వినండి! నేను దాచిన ధనం, నగలూ తీసుకుపోయి వ్యాపారంచేసి కోటీశ్వరుణ్ణి కావడమేకాక, మరొక కోటీశ్వరుడి కుమార్తెను కూడా వివాహం ఆడాను. అయితే, మా యిద్దరి కాపురం హాయిగా జరిగిపోతున్న సమయంలో, ఏదో పెద్ద చప్పుడయి కల చెదిరిపోయి, కళ్ళు తెరిచాను.

నలుగురు ముసుగు దొంగలు విగ్రహం వెనక మనం దాచిన ధనం తీసుకుని గుడి నుంచి బయిటికి పోతున్నారు. నేను వెంటనే పెద్దన్నను తట్టిలేపుతూ, ''దొంగలు! దొంగలు!'' అన్నాను. కాని, పెద్దన్న కళ్ళు తెరవకుండానే, ''నా రాజ్యంలో దొంగలా? వాళ్ళను ఏనాడో కాలరాచేశాను!'' అంటూ పక్కకు తిరిగి పడుకున్నాడు.

అప్పుడు చిన్నన్న భుజం తడుతూ, సంగతి చెప్పాను. చిన్నన్న కూడా కళ్ళు తెరవకుండానే, ''నాగదేవీ, నేను రాజునై



వుండగా, యీ నాగలోకంలో దొంగలా? అహ్హహ!'' అనేశాడు. ఈ లోపల ముసుగు దొంగలు మన ధనంతో అరణ్యం లోకి పారిపోయారు.''

ఇది వింటూనే పెద్ద దొంగలిద్దరూ గాభరాపడుతూ విగ్రహం వెనక్కుపోయి, ధనం మూట కోసం చూశారు; అది కని పించలేదు.

వాళ్ళు కోపంగా చిన్నవాడి దగ్గిరకు వచ్చి, ''నిజం చెప్పు! దొంగలు రావడం, నువ్వు మమ్మల్ని నిద్రలేపాలని చూడడం, అంతా పచ్చి అబద్ధం!'' అన్నారు.

చిన్నవాడు ఏమీ తొణక్కుండా, ''ఇందులో అబద్ధం ఏమీలేదు. మన దురదృష్టం ఏమంటే, ఆ దొంగలు వచ్చి మనం దాచిన సొమ్ము ఎత్తుకుపోతున్నప్పుడు, మీరు తీరని రాచకార్యాల్లో తల మునకలై వుండడం!'' అన్నాడు.

ఆ జవాబుతో పెద్దవాళ్లిద్దరూ రెచ్చిపోయి, ''ఒరే, నిజానికి మేం ఎలాంటి కలలూ కనలేదు. నిద్రపోయే ముందు వాటిని ఊహించుకున్నాం, అంతే! ఇప్పుడైనా నిజం చెప్పు: ఆ ధనం ఎక్కడ దాచావు?'' అని అడిగారు.

ఈసారి చిన్న దొంగ పెద్దగా నవ్వి, ''మీకు ఎలాంటి కలలూ రాలేదన్నమాట! బావుంది. అందువల్ల, మనం అనుకున్న మాట ప్రకారం నేను కన్న కలే గొప్పది. కనక, ధనం అంతా నాకే చెందాలి,'' అంటూ పోయి మర్రిచెట్టు తొర్రలో దాచిన ధనం మూటను తెచ్చి వాళ్ళ ముందుంచాడు.

దొంగలిద్దరూ చిన్నవాడి తెలివితేటలకు ఆశ్చర్యపోయారు. తాము పెద్దవాళ్ళయి వుండీ, చిన్న వాణ్ణి మోసం చేయాలను కున్నందుకు సిగ్గుపడిపోయి, మొత్తం ధనాన్ని చిన్నవాడికి యిస్తూ, ''ఒరే, తమ్ముడూ! ఈనాటినుంచీ నువ్వు దొంగతనాలు మాని, ఎక్కడికైనా పోయి యీ ధనంతో ఏదైనా వ్యాపారం చేసుకుంటూ, తగిన పిల్లను వివాహమాడి సుఖంగా బతుకు,'' అన్నారు.






## 10

[ యుద్ధంలో గాయపడి సమరసేనుడు మరణించినట్టు తెలుసుకున్న శివదత్తుడు, తన అనుచరులతో అడవిలోకి పారిపోయాడు. అక్కడ ఒక కోయగూడెంలో కులపెద్ద అతడికి ఆతిథ్యం యిచ్చాడు. ఆ రాత్రి కోయగూడేల మీద సైనికులు దాడి చేశారు. వాళ్ళల్లో కోయలకు బందీ అయిన సైనికుడొకడు సుబాహు డనే పేరుగల వాడి సంగతి చెప్పాడు. తరవాత—]

"మందరదేవా! ఆ శత్రుసైనికుడి మాటలు నన్నూ, కోయకుల పెద్దనూ కూడా ఆశ్చర్యచకితులను చేసినై. పరిస్థితులు ఏదో కొత్త మార్గాన కదులుతున్నట్టు అనుమానించాను,'' అన్నాడు శివదత్తుడు.

మందరదేవుడు తలపంకించి, ''మీ ఈ కొత్త అనుభవం నన్నూ ఆశ్చర్యపరుస్తున్నది. తరవాత ఏం జరిగిందో చెప్పండి!'' అని అడిగాడు

''నాతోపాటు ఆ కోయకుల పెద్ద కూడా ప్రమాదాన్ని గ్రహించినట్టు కనిపించాడు. అతడు నాకేసి తిరిగి, ''ఈ అడవిలో మరెవరి ప్రమేయం లేకుండా స్వేచ్ఛగా జీవించే మా వరకూ, మీ రాజ్యపు అల్లకల్లోలం, గందరగోళం వ్యాపించినట్టు కనబడుతున్నది. ఈ సైనికుడు చెప్పే ఆ సుబాహుడు రాజైన నరవాహనుడికి ఎంతటి సహాయం చేసివున్నా,




ఈ విధంగా మా గూడెల మీద పడే హక్కు అతడికి లేదనుకుంటాను!'' అంటూ పళ్ళు కొరికాడు.

''ఈ రోజుల్లో బలం గలవాడిదే రాజ్యం! మీ కోయలంతా ఐకమత్యంగా ఎదిరించగలిగితే, కొంత ప్రయోజనం ఉండవచ్చు. అందుకు నా చేతనైన సహాయం చేయగలను,'' అన్నాను.

కొద్దిసేపట్లో ఆ గూడెంలో ఆయుధం పట్టగలిగిన ప్రతివాడూ, వాళ్ళ కులపెద్ద నాయకత్వం కింద, అడవి తగలబడుతున్న ప్రాంతంకేసి బయలుదేరారు. నేను కూడా నా అనుచరులతో వాళ్ళ వెనకనే బయలుదేరాను. తమ స్వేచ్ఛాస్వాతం త్ర్యాలకు ఎంత ముప్పు వాటిల్లపోతున్నదో ఈ కోయలు గ్రహించగలిగితే వీళ్ళ సహాయంతో క్రూర నరవాహనుణ్ణి ఒక దెబ్బ తీయవచ్చని నాకు ఆశ కలిగింది.

మేము కొంత ముందుకు వెళ్ళేసరికి, కత్తులూ, కఠార్లతో వున్న అనేకమంది నరవాహనుడి సైనికులు ఒక కోయగూడెం మీద పడి వీరవిహారం చేస్తూండటం కనిపించింది. వాళ్ళు చేతికి అందినదల్లా సర్వనాశనం చేస్తూ, దొరికిన కోయల చేతులకు తాళ్ళు బిగించి సోలుపుగా నడుపుకుపోతున్నారు. బహుశా పట్టణాల్లో బానిసలుగా అమ్మేందుకు, సైనికులు వీళ్ళనిలా పట్టుకుపోతున్నారని నా కనిపించింది.

అంతలో కులపెద్ద నాయకత్వం కింద వున్న కోయలు భయంకరంగా అరుస్తూ, నరవాహనుడి సైనికుల మీద హఠాత్తుగా పడ్డారు. తమను ఎదిరించే వాళ్ళెక్కడ ఎవ్వరూ లేరన్న ధీమాతో వున్న ఆ సైనికులంతా, హఠాత్తుగా ఇలా జరిగేసరికి నిబ్బరం కోల్పోయి చెల్లాచెదురు కాసాగారు. కోయలు ఆ సైనికులలో దొరికినవాణ్ణి దొరికినట్టు తమ ఈటెలతో పొడుస్తూ, బానిసలుగా బంధింపబడిన తమ జాతివాళ్ళ కట్లు విప్పి, విజయనాదాలు చేయసాగారు.

ఈ పోరాటంలో నేను నా అనుచరులతో పాల్గొనే అవకాశం చిక్కలేదు. కోయల ధైర్యసాహసాలు నన్ను ఆశ్చర్య పరిచినై. కొంత శిక్షణా, క్రమపద్ధతీ అనుసరిస్తే, వీళ్ళ సహాయంతో కుండలినీ ద్వీపాన్ని నరవాహనుడి కబంద హస్తాల నుంచి విముక్తం చేయడం ఏమంత కష్టం కాదనిపించింది.




"ఆ మండుతున్న అడవి ప్రాంతాన్ని అలా వదిలివేయవలసిందేనా? ఆ మంటలు క్రమంగా ఈ ప్రాంతానికూడా వ్యాపించవచ్చు!" అన్నాను కోయకుల పెద్దతో.

అతడు కాలుతున్న అడవికేసి ఓమారు చూసి, "వాటిని ఆర్పటం మానవ మాత్రుడివల్లకాదు, ముట్టించటం మాత్రం తేలికే. సరే, యిప్పుడు ఒక సంగతి చెప్పండి. నరవాహనుడనే పేరుగల మీ రాజు, మా అరణ్య ప్రాంతాలను ఎవరెవరికో సొంతానికి పంచిపెట్టడటమేమిటి? ఒకవేళ ఇదే విధంగా, యీ అడవిలోని కోయలమంతా అతణ్ణి ప్రతిఘటిస్తే, అతడు మమ్ములను సర్వనాశనం చేయడానికి ప్రయత్నించగలడా?" అని అడిగాడు.

అలాంటి ప్రశ్న కోసమే ఎదురు చూస్తున్న నేను, కోయకుల పెద్దకు నరవాహనుడి కుటిల రాజనీతి, అందులో అతడికి సహాయపడిన మరికొందరు ద్రోహుల సంగతీ చెప్పాను. "తనకు సహాయపడిన ద్రోహుల్లో నోరుగల ప్రతివాడికీ, ఏదో ఒక ప్రాంతాన్ని దానంచేసి సంతృప్తిపరచకపోతే, వాళ్ళు అతణ్ణే హతమారుస్తారు. కనక, అతడు ఈ విధంగా చేయక తప్పదు. మీరీ ప్రమాదాన్నుంచి బయటపడాలంటే, అందరూ ఐక్యంగా అతణ్ణి ఎదిరించాలి, అంతకన్న మరో మార్గం లేదు," అన్నాను.

నా మాటలు విన్న, కోయ కులపెద్ద నాలుగైదు నిమిషాలసేపు ఆలోచిస్తూ ఊరుకుని, తరవాత అక్కడ చేరిన కోయలకేసి తిరిగి, "మీరు అడవి నాలుగు

చెరగులకూ ఈ వర్తమానం అందజేయాలి! రేపు సరిగ్గా మిట్టమధ్యాహ్నంవేళ తోడేలు గూడెంలో కులపెద్దలందరూ సమావేశం కావాలి. వాళ్ళు తమ తమ అనుచరుల్ని వెంటబెట్టుకురావటం మంచిది. వెళ్లండి!'' అంటూ పెద్దగా అరిచాడు.

మరుక్షణంలోనే ఆయుధాలు ధరించిన బలశాలులైన కోయ యువకులు కేకలు పెట్టుకుంటూ అడవి అన్ని దిక్కులకూ పరిగెత్తసాగారు. నేను కోయ కుల పెద్ద వెంట తోడేలు గూడెం కేసి బయలు దేరాను.

మేము గూడెం చేరేసరికి బాగా తెల్లవారి పోయింది. దగ్గర్లో అన్ని గూడేలు వుండగా కుల పెద్దల సమావేశానికి, ఇంతదూరంలో వున్న యీ తోడేలు గూడేన్ని, వృద్ధుడు ఎందుకు ఎన్నుకున్నాడో గూడేన్ని చూచిం తరవాత నా కర్థమైంది.

ఈ తోడేలుగూడెం అన్ని కోయగూడేల లాంటిది కాదు. గూడేనికి చుట్టూ ఎత్తయిన మట్టి గోడా, అక్కడక్కడా ఎత్తయిన బురుజులూ కనిపించాయి. గూడెంలో వున్న పెద్ద చెట్ల మీద మంచెలూ, అక్కడినుంచి బాణాలు వదిలేందుకు అనువైన స్థావరాలూ ఉన్నాయి. గూడెం మధ్య వున్న బ్రహ్మాండమైన టేకుమాను ఎక్కి చూస్తే అక్కడికి చుట్టుపట్ల రెండు మూడు కోసుల వరకూ అడవిలో ఏం జరుగుతున్నదీ చూడవచ్చు. అదీ యీ గూడెం ప్రత్యేకత!



పొద్దు ఎక్కుతున్నకొద్దికీ క్రమంగా కులపెద్దలు తమ తమ అనుచరులతో గూడెం చేరసాగారు. ఈ పెద్దల్లో బాగా వృద్ధులూ, యువకులూ కూడా వున్నారు. అందరూ పూర్తిగా ఆయుధ సన్నద్ధులై వచ్చారు. అందరి ముఖాల మీదా భయం, అదుర్దా స్పష్టంగా కనబడుతున్నది.

సరిగా మిట్టమధ్యాహ్నం వేళకు సమావేశ ప్రారంభ సూచనగా పెద్ద పెద్ద తప్పెటలు మోగించబడినై. ఊడలు దిగిన ఒక పెద్ద మర్రిచెట్టు కింద పులిచర్మాలూ, జింక చర్మాలూ పరచబడినై. కులపెద్దలంతా ఒక్కొక్కళ్ళే వచ్చి వాటి మీద కూర్చోసాగారు. నా వెంట వున్న వృద్ధుడికి చెట్టు మొదట్లో ఒక ఉన్నతాసనం యివ్వబడింది. నాకూ, నా అనుచరులందరికీ అతడికి కొంచెం పక్కగా స్థానాలు చూపబడినై.

వివిధ రకాల పండ్లూ, మాంసాలూ, మద్యం అక్కడ చేరినవారి కందరికీ వడ్డించబడినై. అందరూ తృప్తిగా తిన్న తరవాత వృద్ధుడు స్పష్టమైన స్వరంతో సమావేశానికి వాళ్ళనందరనూ పిలిచిన కారణం వివరించాడు: "పరిస్థితులు తారుమారైనట్టు కనబడుతున్నవి. ఈ కుండలినీ ద్వీపంలో యీనాటివరకూ ఎన్ని రాజరికాలు మారినా, యీ అడవుల్లో నివసించే మనను అవేమీ బాధించలేదు. తరతరాలనుంచీ యీ వనసంపదను నమ్ముకుని స్వేచ్ఛగా బతుకుతున్న






మనను, యీనాడు రాజరికంలో వచ్చిన మార్పు చీకాకు పరచనున్నట్టు కనబడుతున్నది. గత రాత్రి జరిగిన దారుణ సంఘటనలు మీరు చూసే వుంటారు!'' అంటూ వృద్ధుడు ముగించాడు.

అప్పుడు సమావేశానికి వచ్చిన కుల పెద్దల్లో ఒకరొకరే లేచి వాళ్ళ వాళ్ళ అనుభవాలు వివరించారు. వాళ్ళు చెప్పిన దానినిబట్టి, మొత్తం అడవి ప్రాంతాన్నంతా నరవాహనుడు తన అనుచర ముఖ్యులకు బహుమానాల కింద కట్టబెట్టినట్టు నా కర్థమైంది.

ఇప్పుడేం చేయాలి? ఈ ప్రశ్న అక్కడ చేరినవారినందర్నీ కలత పెడుతూనే వుంది. ఏదో ఒకటి చేయాలని తప్ప ఆ చేయవలసిందేమిటో చాలామందికి అవగాహన అయినట్టులేదు. ''ఈ అడవి మనది! దీని మీద హక్కు భుక్తాలన్నీ మనవి!'' ఇదీ వచ్చిన పెద్దలలో కొందరి మాటల ధోరణి.

వాళ్ళు చెప్పినదంతా శ్రద్ధగా విన్న తరవాత వృద్ధుడు, ''అయితే, ఆ హక్కును నిలబెట్టుకోవటం ఎట్లా?'' అని వాళ్ళను సూటిగా ప్రశ్నించాడు.

అక్కడ చేరిన వాళ్ళల్లో చాలామంది యీ ప్రశ్న విని ముఖముఖాలు చూసుకోసాగారు. కొద్దిసేపు నిశ్శబ్దం తరవాత, ఒక యువకుడు లేచి, ''వాళ్ళు మన మీద బలప్రయోగం చేసి లొంగతీసుకో దలిచారు. కనుక, మనం మన బల ప్రదర్శనం ద్వారానే వాళ్ళను ప్రతిఘటించి ఓడించవలసివుంటుంది!'' అన్నాడు.

ఈ మాటలకు సమావేశం అన్ని మూలలనుంచీ 'అవును, అవును!' అన్న ప్రతిధ్వనులు వినిపించినై. ఇలాంటి తరుణం కోసమే వేచివున్న వృద్ధుడు తృప్తిగా తల వూపుతూ, ''అయితే, కుల పెద్దలందరూ తమ తమ అనుచరుల్ని వెంటనే పోగుచేయటం మంచిది. శత్రువులు గూడెం మీద పడి మనను క్రమ

క్రమంగా లొంగదీసుకునే అవకాశం యివ్వకూడదు. మనం కూడా వున్న పూర్తి బలంతో శత్రువును ఎదుర్కొని విజయమో, పరాజయమో తేల్చుకోవటం మంచిది!'' అన్నాడు.

సమావేశమైన పెద్దలందరికీ అతడి మాటలు నచ్చినై. అంగీకార సూచకంగా అందరూ చప్పట్లు చరిచారు. అప్పుడు వృద్ధుడు, ''కాని, మీ అందరి అనుమతితో ముందుగా నేనొక చిన్న పని చేయ దలుచుకున్నాను. ఇప్పుడు కుండలినీ ద్వీప రాజ్యాన్ని హస్తగతం చేసుకున్న ఆ నరవాహన రాజుకు, యీ అడవి ప్రాంతంపై తన సైనికులను పంపటం ధర్మంకాదని తెలియపరుస్తాను. దానికి అతడి సమాధానం ఎలా వుంటుందో కూడా చూద్దాం!'' అన్నాడు.

ఈ ప్రయత్నానిక్కూడా అందరూ తలలు వూపారు. దానితో సమావేశం పూర్తయింది. మరనాటి సాయంకాలం లోపల కులపెద్ద లందరూ తమ తమ అనుచరులతో తోడేలు గూడెం చేరేట్టు నిర్ణయం జరిగింది. అడవి మొగడలలో వున్న గూడేలను ఖాళీచేసి, స్త్రీలనూ, పిల్లలనూ బాగా అడవి లోపలి భాగానికి పంపాలని నిశ్చయించుకున్నారు.

అందరూ వెళ్ళిపోయింతరవాత వృద్ధుడు నన్ను దగ్గరకు పిలిచి, ''మీ అభి



ప్రాయం ఏమిటి? ఈ వచ్చిన ముఖ్యు లందర్నీ చూశారుగదా! వీళ్ళు ఆ సైని కుల ధాటికి నిలబడగలరా?'' అని అడిగాడు.

''అది యిప్పుడే చెప్పలేం. ఆ నర వాహనుడి సైనికులు సుశిక్షితులు. పైగా, వాళ్ళకు అశ్వికబలం వున్నది. మెరుపులా దాడిచేసి అంతలో మాయమైపోగలరు. ఇక మీదిముఖ్యంగా కాల్బలం. యుద్ధంలో విజయానికి ఒక్క ధైర్యసాహసాలే చాలవు. మీరు కొంత అశ్వికబలాన్ని కూడా సమకూర్చగలరా?'' అన్నాను.

వృద్ధుడు పెదాలు చప్పరించి, ''అది యిప్పట్లో సాధ్యమయే పనికాదు.

మా కోయ యువకుల్లో కొందరు యిప్పు డిప్పుడే అడవి గుర్రాలను మచ్చికచేసి, వాటికి జీనులూ, కళ్ళేలూ లేకుండా స్వారి చేయటం అలవరుచుకుంటున్నారు. జీనులూ అవీ చేసే నేర్పరులైన పనివాళ్లు మాకు లేరు. అవసరం అయితే, కొంత అశ్వికబలాన్ని కూడా సమకూర్చవచ్చు,'' అన్నాడు.

''అయితే, తప్పక ప్రయత్నించండి. వాటి అవసరం చాలా వుంటుంది!'' అని సలహా యిచ్చాను. తరవాత వృద్ధుడు, ఒక యువకుణ్ణి పిలిచి, ఒక జంతు చర్మం మీద పదునైన కత్తి మొనతో ఏదో రాసి, ''దీనిని నరవాహన మహారాజుగారికి చేర్చాలి. నువ్వు నిర్భయంగా ఈ అడవి నుంచి మైదానం మీదికి పోవచ్చు. ఏ సైని కుడికి దీనిని చూపించినా, అతడు నిన్ను ఆ రాజు దగ్గరక్కు తీసుకుపోతాడు. నువ్వు మాత్రం నిరాయుధుడుగా వెళ్లవలసి వుంటుంది. రాజు యిచ్చే జవాబుతో తిరిగిరా,'' అని ఆజ్ఞాపించాడు.

వృద్ధుడు పంపుతున్న ఈ లేఖవల్ల ఏమాత్ర ప్రయోజనం కలుగుతుందో చూడాలన్న ఉత్సుకత నాలో కలిగింది. ఒకటి మాత్రం నేను గ్రహించాను. దీని వల్ల పెద్ద ఉపయోగం కలుగుతుందని వృద్ధుడు కూడా ఆశిస్తున్నట్టు నాకు కనబడలేదు.

ఆ రాత్రి భోజనాల తరవాత మేమంతా తోడేలు గూడెంలోనే నిద్రించాం. అడవి కాలుతున్న సూచనగా తెల్లవార్లూ మంటలు కనబడినై.

తెల్లవారిం తరవాత మేం లేచి చూసే సరికి, అప్పటికే వృద్ధుడూ, మరికొందరు కోయలూ, గూడెం మధ్యవున్న పెద్ద టేకు మాను కింద చేరి వున్నారు. నేను అక్క డికి వెళ్ళేసరికి మాను పైన వుండి మైదాన ప్రాంతాన్ని పరికించి చూస్తున్న ఒకడు పెద్దగా కేక పెట్టి, ''అదుగో, మనవాడు వస్తున్నాడు. కాని అదేమిటి, గాడిద మీద కూర్చున్నాడు!'' అంటూ ఆశ్చర్యం ప్రకటించాడు. —(ఇంకా వుంది)





# తోడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీ పట్టుదలా, అతి కఠినమైన శ్రమను సహించే శక్తీ చూస్తూంటే, మెచ్చుకోకుండా వుండలేకపోతున్నాను. కాని, ఒంటరిగా అన్ని కార్యాలు సాధించడానికీ అవి అక్కరకు రావు. తోడుగా వుండి సాయపడగల వాళ్ళు కూడా ఎంతో అవసరం. ఇందుకు ఉదాహరణగా నీకు లవంగదేశం వాడైన మహాసారుడనే యువ వైద్యుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

లవంగదేశంలో మూలికావనం అనే పెద్ద అరణ్యం వున్నది. అందులో అద్భుతమైన ఎన్నో మూలికలు వుండేవి.

## బేతాళ కథలు



రాజధానీ నగరంలో మహాసారు డనే యువ వైద్యుడు ఉన్నాడు. అతడు పిన్న వయసులోనే మానవ శరీరశాస్త్రాన్నీ, వైద్యశాస్త్రాన్నీ ఆకళింపు చేసుకుని గొప్ప వైద్యుడుగా పేరు పొందాడు. నగరంలోని కాకలు తీరిన వైద్యులందరికీ అతడంటే చెప్పరానంత అసూయ. అతణ్ణి ఎలా దెబ్బ తీయడమా అని వాళ్ళు ఆలోచిస్తూండగా, మూలికావననం మీద రాజుగారి ఆంక్ష వచ్చింది. మహాసారుడు తన వైద్యానికి పూర్తిగా మూలికావనంపైనే ఆధారపడ్డాడు. అందులో అతడు వైద్యానికి పనికివచ్చే ఎన్నో కొత్త మూలికలు కనుగొన్నాడు.

మహాసారుడు వైద్యులందర్నీ కలుసుకుని, సమస్య వివరించి, మూలికావన ప్రవేశానికి అనుమతి యిప్పించాలని రాజును వేడుకుందామన్నాడు. ఇందుకు వైద్యులెవరూ ఒప్పుకోలేదు.

బాగా ఆలోచించిన మీదట మహాసారుడు తానొక్కడే వెళ్ళి రాజును కలుసుకుందామన్న నిర్ణయానికి వచ్చాడు. కాని, తండ్రి అతణ్ణి వారిస్తూ, ''కార్యసాధకుడెన్నడూ ఒంటరిగా పోరాదు. పని సానుకూలం కావాలంటే తోడు వుండాలి. అలాంటి సరైన తోడును ఎన్నుకోవడంలోనే, నీ ప్రజ్ఞ వుంటుంది,'' అన్నాడు.

ఆ అరణ్యం కారణంగానే లవంగదేశం సుభిక్షంగా వున్నదని పెద్దలు చెప్పేవారు. అయితే, ఒక సంవత్సరం దేశంలో కాటకం ఏర్పడింది. ఎక్కడా వానలు లేవు. అందుకు కారణం త్వరలోనే తెలిసింది. మూలికావనం క్రమక్రమంగా పలచబడిపోతున్నది. పల్లెవాసులు అరణ్యంలోని చెట్లను నరికి, వంటచెరుకుగా ఉపయోగిస్తున్నారు. వృక్షసంపద క్షీణించడంతో వానలు సరిగా కురవడంలేదు.

ఈ సంగతి తెలియగానే లవంగ దేశపు రాజు మూలికావనం రక్షణకు సైనికుల్ని కాపలా పెట్టి, తన అనుమతిలేకుండా ఎవరూ అందులో ప్రవేశించరాదని శాసనం చేశాడు.

"మీ మాట కాదనను. కాని, సరైన తోడును ఎన్నుకునే ప్రజ్ఞ నాకు లేదు. మీరు ఎవరి పేరు చెబితే వారిని తీసుకుని వెళ్ళి రాజును కలుసుకుంటాను," అన్నాడు మహాసారుడు.



మహాసారుడి తండ్రి కుశంకుడి పేరు సూచించాడు. కుశంకుడు లవంగ రాజుకు సవతి తమ్ముడు. అతగాడు దుర్బుద్ధుల పుట్ట! సవతి తల్లి యింకా జీవించి వుండడంవల్లా, వంశగౌరవాన్ని వీధిపాలు చేయడం యిష్టంలేకా, రాజు అతణ్ణి సహిస్తున్నాడు.

ఈ సంగతి అందరికీ తెలిసిందే. అయినా మహాసారుడి తండ్రి, కొడుకుతో, "ఒకసారి ఆ కుశంకుడికి ప్రమాదకరమైన జబ్బు చేస్తే, నువ్వు నయం చేశావు. రాజుగారు అతడి మాట కాదనడు," అన్నాడు.

మహాసారుడు, కుశంకుణ్ణి వెంట బెట్టుకుపోయి రాజదర్శనం చేశాడు. తన సవతి తమ్ముణ్ణి చూస్తూనే రాజు యిబ్బందిగా మొహం పెట్టాడు. కుశంకుడు మహాసారుణ్ణి గురించి రాజుకు చెప్పి, "మళ్ళీ, మళ్ళీ నేను మీ దగ్గిరకు రానవసరం లేకుండా, యీ మహావైద్యుడికి మూలికావనం ప్రవేశించేందుకు అనుమతి పత్రం యిప్పించండి," అన్నాడు.

రాజు మారుమాట్లాడకుండా అనుమతి పత్రాన్ని మహాసారుడికిప్పించాడు. మహాసారుడు ఇంటికి వెళ్ళి, తండ్రి సలహాను ఎంతగానో మెచ్చుకున్నాడు.

రాజధానిలోని ఇతర వైద్యులు మహాసారుడి పీడ వదిలించుకోవడం ఎలానా అని ఆలోచించి ఒక ఉపాయం పన్నారు. రాజ్యం పొలిమేరల్లో వున్న ఒక కుగ్రామంలో భయంకరమైన అంటు వ్యాధి ప్రబలిందనీ, దాన్ని కుదర్చగల సామర్థ్యం ఒక్క మహాసారుడికే వున్నది గనక, ఆయన్ని అక్కడికి పంపవలసిందిగా గ్రామస్థులు కోరుతున్నట్టు ఒక దొంగ లేఖ తయారుచేసి, దాన్ని రాజుకు చేరేలా



చేశారు. రాజు ఆ వివరాలన్నీ మహాసారుడికి పంపి, తక్షణం ఆ గ్రామానికి వెళ్ళవలసిందిగా ఉత్తరువు జారీ చేశాడు.

ఆ సమయంలో నగరంలోని ప్రముఖులెందరో మహాసారుడి వద్ద చికిత్స పొందుతున్నారు. వాళ్ళను మధ్యలో వదిలి వెళ్ళడం అతడికి యిష్టంలేదు. పైగా, ఇదంతా వైద్యుల కుట్ర అని అతడికి తెలుసు. అందువల్ల మహాసారుడు రాజును దర్శించాలనుకున్నాడు.

తండ్రి అతడికి, ''ఈసారి కుశంకుణ్ణి వెంటబెట్టుకుని వెళ్ళకు. తన ఆజ్ఞ నిరాకరిస్తే, రాజు సహించలేడు. కుశంకుడంటే అయనకున్న అసహనంవల్ల, నీ పని సానుకూలం కాదు. మహారాజుకు యిష్టుడైన విదూషకుణ్ణి వెంటబెట్టుకుపో,'' అని సలహా యిచ్చాడు.

మహాసారుడు తండ్రి చెప్పినట్టే చేశాడు. విదూషకుడు రాజుతో, ''మహాప్రభూ, మహాసారుడు తమ ఆజ్ఞ ప్రకారం రాజధాని వదిలి వెళుతున్నాడు. అతడితో పాటు నేనూ, మరికొందరు నగర ప్రముఖులం కూడా వెళుతున్నాం. ఇందుకు తమ అనుమతి కోరుతున్నాను,'' అన్నాడు.

మహాసారుడితోపాటు వెళుతున్నవారి పేర్లు వింటూనే రాజు కలవరపడి, విదూషకుణ్ణి అందుకు కారణం అడిగాడు. వాళ్ళందరూ అనారోగ్యంతో బాధపడుతున్నారనీ, మహాసారుడు లేనిదే వాళ్ళకు క్షణం కూడా గడవదనీ విదూషకుడు చెప్పాడు. వెంటనే రాజు తన ఉత్తర్వును ఉపసంహరించుకుని, సరి అయిన వైద్యుణ్ణి ఆ గ్రామానికి పంపే పని రాజవైద్యుడికి అప్పగించాడు.

కొద్ది రోజుల తరవాత రాజధానీ నగరానికి సత్యసారుడనే గొప్ప వైద్యుడు వచ్చాడు. అయనకు తెలియని వైద్య రహస్యాలు లేవనీ, ఊరూరూ తిరుగుతూ తనకు నచ్చినవాడికి వైద్యశాస్త్రంలోని రహస్యాలు చెపుతూంటాడనీ ప్రతీతి. అయితే, అయనతో ఒక ఇబ్బంది వున్నది.

సత్యసారుడు మహా కోపిష్టి. ఒకసారి తన చేత తిట్లు తిన్నవాడిని ఆయన శిష్యుడుగా స్వీకరించడు.

నగరంలోని చాలామంది వైద్యులు ఆయన వద్దకు వెళ్ళి తిట్లు తిని వచ్చారు. మహాసారుడికి తండ్రి యీ పర్యాయం రాజనర్తకి చిత్రలేఖను తోడుగా తీసుకు పొమ్మని చెప్పాడు. ఒకసారి ఆమెకు కాలి మీద ఏదో వ్రణం పుట్టగా, రాజ వైద్యుడు శస్త్రచికిత్స చేసి కాలు తీసి వేయాలన్నాడు. అలా జరిగితే తన నాట్యానికీ, రాజనర్తకి పదవికీ భంగంవాటిల్ల గలదని చిత్రలేఖ భయపడి మహాసారుణ్ణి చూడవచ్చింది. అతడామెకు శస్త్రచికిత్స లేకుండానే వ్రణాన్ని నయం చేశాడు.

మహాసారుడు సంగతి చెప్పగానే చిత్రలేఖ అతడి వెంట సత్యసారుడి దగ్గిరకు రావడానికి ఒప్పుకున్నది. చిత్రలేఖ సౌందర్యానికి సత్యసారుడు అచ్చెరువు చెందాడు.

ఆమె, సత్యసారుడికి ఎంతో వినయంగా నమస్కరించి, "స్వామీ, తమరు వైద్య శాస్త్రంలో మహాప్రవీణులని వినడమేగాని, తమ రూపం దైవాంశ సంభూతులను తల పింపచేయగలదని అనుకోలేదు. తమ ముందు నాట్యం చేయాలన్న అభిలాషతో వచ్చాను," అన్నది.



తరవాత ఆమె మహాసారుడిని గురించి చెప్పి, "తమకు విద్యకు తగ్గ శాంత గుణమున్నదని విన్నాను. ఈ నా మిత్రుణ్ణి, శిష్యుడుగా చేర్చుకోగలరని ఆశ," అన్నది.

సత్యసారుడు, మహాసారుణ్ణి ఆప్యాయంగా పలకరించి, నాలుగు రోజుల్లో తనకు తెలిసిన వైద్యరహస్యాలన్నీ అతడికి చెప్పి వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన తర్వాత మహాసారుడు తండ్రితో, "నాన్నా, లోగడ నువ్వెన్ని సార్లు చెప్పినా, వివాహం నా వైద్యవృత్తికి ఆటంకం కాగలదన్న భయంకొద్దీ, బ్రహ్మచారిగా వుండిపోదలిచానని అన్నాను. ఇప్పుడు నా మనసు మారింది. నీకు

నచ్చిన పిల్లను కోడలుగా తీసుకురా, నాకు అభ్యంతరంలేదు,'' అన్నాడు.

బేతాళుడు యీ కథ చెప్పి ''రాజా, మహాసారుడి తండ్రి కొడుకుకు యిచ్చిన సలహాలు వింతగానూ, అనాలోచితంగానూ లేవా? ఒకసారి, రాజు అసహ్యించుకునే సవతి తమ్ముణ్ణి తోడుగా తీసుకుపొమ్మన్నాడు. మరొకసారి విదూషకుణ్ణి వెంటబెట్టుకు వెళ్ళమన్నాడు. సత్వసారుడి వంటి మహావ్యక్తితో పని సానుకూలం అయేందుకు నాట్యకత్తె సాయం కోరమన్నాడు. ఈ మూడు సలహాలూ బెడిసికొట్టి మహాసారుడు చిక్కుల్లో పడవలసింది, కాని అలా జరగలేదు. అందుకు అతడి అదృష్టమా లేక మరేమైనా యితర కారణాలున్నవా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మహాసారుడి తండ్రి ఎంతో లోకజ్ఞానంతోపాటు, సంఘంలో వివిధ స్థానాల్లో వుండే మనుషుల మనస్తత్వాలను లోతుగా అర్థం చేసుకున్నవాడు. రాజు మరొకసారి చూడడానికి యిష్టపడని సవతి తమ్ముణ్ణి తోడుగా తీసుకువెళ్ళమని చెప్పి, మహాసారుడి కోరిక మరుక్షణంలో రాజు అంగీకరించేలా చేశాడు. విదూషకుడి విషయంలోనూ అంతే జరిగింది. పరిపాలనకు సంబంధించిన సమస్యలతో తలమునకలవుతూండే రాజులకు, విదూషకుడి కన్న అప్తమిత్రుడు మరొకడుండడు. ఇక, సత్వసారుడి సంగతికొస్తే, ఎంత కోపిష్టి మనిషి అయినాసరే లలితకళలకూ, అద్భుత సౌందర్యానికీ తలవంచుతాడని తెలిసిపోతుంది. ఈ అనుభవాలన్నిటి ద్వారా మహాసారుడు జీవితంలో తోడంటూ వుండడం ఎంత అవసరమో గ్రహించి, వివాహమాడి గృహస్థు అయేందుకూ డా ఒప్పుకున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# తిక్కకు శాస్తి

ఒక యాత్రికుడు ఒక అడవి మార్గాన వెళుతూండగా దారిలో చీకటి పడింది. ఇప్పుడు ఏమి చేయటమా అని అతడు దిక్కులు చూసేంతలో ఒక కుటీరం కనబడింది. యాత్రికుడు ఆ కుటీరంలో ప్రవేశించాడు. అక్కడ ఒక మనిషి వంట చేసుకుంటున్నాడు. ఒక మూల ఒక పిల్లి చుట్టచుట్టుకుని పడుకుని ఉంది.

"అయ్యా, పరదేశిని, యాత్రికుణ్ణి. ఈ రాత్రికి నా కింత తిండి పెట్టి, ఇక్కడ పడుకోనిస్తే మీ మేలు మరవను," అన్నాడు యాత్రికుడు.

"అందుకేమీ అభ్యంతరం లేదు. కాని నా కొక ఆచారం ఉన్నది. మా యింటికి అతిథిగా వచ్చేవాడు నేను వేసే ప్రశ్నలకు సరి అయిన సమాధానాలివ్వాలి. లేకపోతే చెంప వాయిస్తాను," అన్నాడు గృహస్థు. అందుకు యాత్రికుడు సరేనన్నాడు.

"అయితే తలుపు మూసి లోపలికి వచ్చి కాస్సేపు చలి కాచుకో. ఇంతలో వంట అవుతుంది," అన్నాడు గృహస్థు.

కొంతసేపటికి ఆయన వంట పూర్తి చేసి, తనకూ అతిథికీ వడ్డన చేశాడు. ఇద్దరూ కడుపు నిండా తిన్నారు. మాటల మధ్యలో గృహస్థు తన అతిథికి మూల నున్న పిల్లిని చూపించి, "అదేమిటి?" అని అడిగాడు.

ఈ మానవుడు ఇంత చిన్న పిల్లవాడి లాగా అడుగుతాడేమా అని ఆశ్చర్య పడుతూ యాత్రికుడు, "అది పిల్లి కదా?" అన్నాడు. "కాదు! అది శుచిత్వం! తెలిసిందా?" అంటూ గృహస్థు అతిథి చెంప మీద ఒక్కటి వేశాడు. ఈ వింత ప్రవర్తనకు యాత్రికుడు ఆశ్చర్యపోయాడు. ఇంతలో గృహస్థు మళ్ళీ యాత్రికుడికేసి తిరిగి నీటి కుండను

చూపుతూ, "అందులో ఏమున్నది?" అన్నాడు.

"నీరు," అన్నాడు యాత్రికుడు.

"కాదు. అందులో ఉన్నది మంచితనం!" అంటూ గృహస్థు మళ్ళీ యాత్రికుడి చెంప మీద కొట్టాడు.

కాస్సేపయాక గృహస్థు మళ్లీ, "ఆ పొయిలోది ఏమిటి?" అన్నాడు.

"నిప్పు," అన్నాడు యాత్రికుడు.

"కాదు, సౌఖ్యం!" అన్నాడు గృహస్థు. మళ్లీ అతిథి చెంప మీద దెబ్బపడింది.

ఈసారి గృహస్థు ఇంటి కప్పుకేసి చూపి, "అది ఏమిటి?" అన్నాడు.

"కప్పు!" అని యాత్రికుడు సమాధానం చెప్పాడు.

"కాదు, ఎత్తు!" మళ్లీ యాత్రికుడి చెంప పేలింది.

యాత్రికుడు లేచి, "నా బుర్రంతా వేడెక్కింది. ఒక్కసారి బయటికి వెళ్లి చల్లగాలి అనుభవించి వస్తాను," అంటూ తలుపు తెరుచుకుని బయటికి వెళ్ళాడు.

అదే సమయంలో పిల్లి లేచి, తాను కూడా బయటికి వెళ్ళింది.

యాత్రికుడు ఆ పిల్లిని పట్టుకుని, దాని తోకకు చితుకులు అంటగట్టి నిప్పు అంటించి, దాన్ని కప్పు మీదికి ఎక్కించాడు. తరవాత అతను లోపలికి వచ్చి గృహస్థుతో, "అయ్యా, మీ శుచిత్వం సౌఖ్యాన్ని వెంటబెట్టుకుని ఎత్తుకుపోయింది, మంచితనంతో సౌఖ్యాన్ని అరికట్టండి," అన్నాడు.

గృహస్థుకు ఈ మాట కొంచెం కూడా అర్థం కాలేదు. ఆయన చిరాకుగా, "ఏమిటా అర్థంలేని మాటలు? సరిగా చెప్పి యేడవరాదా?" అన్నాడు.

"బుద్ధిహీనుడా, నీ ఇంటి కప్పు నిప్పంటుకున్నది. వెళ్ళి ఆర్పుకో. నీ ఆతిథ్యం చాలు. నా దారిన నేను పోతున్నాను," అంటూ యాత్రికుడు గృహస్థును పట్టుకుని, దవడలు ఎడా పెడా వాయగొట్టి, ఆ చీకట్లోనే పడి వెళ్ళిపోయాడు.





# అసలైన పలుకుబడి

ఉత్కళరాజ్య నివాసి అయిన ఉమా కాంతు డనే వ్యాపారి, ఆ రాజ్యం వదిలి విజయపురి సంస్థానంలోని సీతాపురంలో చాలా కాలంగా పట్టుబట్టల వ్యాపారం చేసుకుంటున్నాడు.

ఆ గ్రామంలో రాజయ్య, రంగయ్య అనే యిద్దరు భూస్వాములున్నారు. వాళ్లు గ్రామ పెత్తనం కోసం తరచు తగువులాడుతూండేవాళ్ళు. ఆ కారణంవల్ల, వాళ్ళను సమర్ధించే ప్రజలు రెండు పక్షాలుగా చీలిపోయారు. ఉమాకాంతుడు మాత్రం తాను కేవలం వ్యాపారంకోసం వచ్చినవాడు కావడంచేత, గ్రామంలోని గొడవలకు దూరంగా వుంటూండేవాడు. ఇందువల్ల, పరస్పరం ద్వేషించుకునే గ్రామంలోని ఇరుపక్షాలవాళ్ళూ, ఉమాకాంతుడికి తమ సొంత సమస్యలు చెప్పుకుని సలహాలు అడుగుతూండేవాళ్ళు.

గ్రామంలో ఎంతో కాలంగా శిధిలావస్థలో వున్న శివాలయం ఒకటున్నది. ముసలి జమీందారు పోయి, ఆయన కొడుకు అధికారానికి వస్తూనే, ఆలయాన్ని బాగు చేయించి, దాని పేర కొంత పొలం మాన్యంగా యివ్వదలిచాడు.

కొత్త జమీందారు యీ సంగతి సీతాపురం గ్రామస్థులకు తెలియజేస్తూ, శివాలయానికి ధర్మకర్తగా వుండదగిన వ్యక్తి ఎవరైనదీ నిర్ణయించమని వర్తమానం పంపాడు. రాజయ్య, రంగయ్య పక్షాల వాళ్ళు ఎన్ని సంప్రతింపులు చేసీ, రాజీ మార్గాలు ఆలోచించీ కూడా, తమ లో ఎవరు ధర్మకర్తగా వుండాలో తేల్చుకోలేక పోయారు.

ఒక నెల రోజులు గడిచినా సీతాపురం నుంచి జమీందారుకు ఎలాంటి జవాబూ రాలేదు. ఆయన తన నౌకర్ల ద్వారా గ్రామ

జొన్నలగడ్డ రత్న



పరిస్థితి తెలుసుకున్నాడు. ఈసారి ఆయన సీతాపురానికి తన దివాణం ఉద్యోగిని పంపాడు. అతడు జమీందారు మాటగా గ్రామస్థులకు యిలా చెప్పాడు :

"మీ గ్రామంలో వుంటున్న విదేశ వ్యాపారస్థుడైన ఉమాకాంతుడు అందరికీ సన్నిహితుడనే సంగతి మాకు తెలిసింది. ఆలయానికి ధర్మకర్తగా అతడుండటం ఎవరికీ అభ్యంతర కారణం కాదన్న నమ్మకంతో అతణ్ణి ధర్మకర్తగా నియమిస్తున్నాం."

ఇందుకు గ్రామస్థులు అభ్యంతరంగాని, ఆమోదంగాని తెలపకుండా మౌనంగా వూరుకున్నారు.

అప్పుడు ఉమాకాంతుడు కల్పించుకుని, దివాణం ఉద్యోగితో, "అయ్యా, నేను చెప్పబోయేది జమీందారుగారికి, క్షమాపణ పూర్వకంగా విన్నవించుకుంటున్నట్టు తెలియచెయ్యండి. ధర్మకర్తలాంటి గొప్ప పదవికి, నేను అర్హుణ్ణి కాను," అన్నాడు.

దివాణం ఉద్యోగి వెళ్ళిపోయాడు.

భర్త యిల్లు చేరే లోపల పొరుగువాళ్ళ నుంచి సంగతి తెలుసుకున్న ఉమాకాంతుడి భార్య, భర్తను, "నువ్వు చేసిన పని తెలివైనదనుకుంటున్నావా? నీకు గ్రామంలో వున్న పలుకుబడి గురించి విన్నాకనేగదా, జమీందారు నిన్ను ఆలయ ధర్మకర్తగా వుండమని కోరింది. దేశం కాని దేశంలో లభించిన గౌరవాన్ని చేజేతులా వదులుకున్నావు!" అని దెప్పి పొడిచింది.

ఉమాకాంతుడు శాంతంగా, "వెర్రి దానా, తగువులూ, దెబ్బలాటల్లో మునిగి తేలే ఏ గ్రామస్థుల మధ్య అయినా, తటస్థంగా పోయే నాబోటివాళ్ళకు ఎప్పుడూ ఒక ప్రత్యేక స్థానం వుంటుంది. దాన్ని పలుకుబడి అనుకోవడం మాత్రం పొరబాటు! నిజంగా నాకున్నది పలుకుబడే అయితే, జమీందారు ధర్మకర్తగా ఎవరుంటారని మొదట కబురు పంపి

నప్పుడే, అందరూ ఏకగ్రీవంగా నా పేరు సూచించేవాళ్ళు. ఆ రాజయ్యా, రంగయ్యలు పదవి తమలో ఏ ఒకరికో కావాలనుకునే, ఏ జవాబూ యివ్వకుండా వూరుకున్నారు,'' అన్నాడు.

ఆ తరవాత రెండు నెలలు గడిచే లోపల ఆలయ పునరుద్ధరణ జరిగింది. ప్రారంభోత్సవానికి వచ్చిన జమీందారు, గ్రామస్థులను సమావేశపరిచి, ''గ్రామ పెద్దరికం కోసం, మీలో మీరు తగువులాడు కుంటున్న సంగతి, ఆ మధ్యనే తెలిసింది. ఆలయ ధర్మకర్త అంటే, గ్రామ పెద్ద కాదు; దేవుడి ప్రధాన సేవకుడు. అందుకు మీరంతా ఏకగ్రీవంగా ఆమో దించగల వ్యక్తి గ్రామంలోనే లేడా ?'' అని అడిగాడు.

ఆ మాటలతో రాజయ్యా, రంగయ్యలకు తమ తమ గ్రామ పెత్తందారీతనానికి భంగపాటు కలగదన్న నమ్మకం కుదిరింది. ఆ క్షణంలో యిద్దరూ శత్రుత్వం మరిచి, కూడబలుక్కుని జమీందారుతో, ''మా ఇద్దరి పలుకుబళ్లూ, గ్రామంలో సగం, సగం జనానికే పరి మితమైపోయినై. ఉమాకాంతుడు అలా కాక గ్రామ ప్రజలందరిలోనూ పలుకుబడి వున్నవాడు. ఆయన్ని ధర్మకర్తగా నియ మించేందుకు, మా అందరి ఆమోదం తెలుపుతున్నాం,'' అన్నారు.

జమీందారు అక్కడికక్కడే ఉమా కాంతుణ్ణి శివాలయం ధర్మకర్తగా నియ మించాడు.

ఈ సంగతి విన్న ఉమాకాంతుడి భార్య, భర్త ఇంటికి రాగానే, ''ఆ నాడు జమీందారుగారి మాట తోసిపుచ్చినవాడివి, యివాళ ఎలా అంగీకరించావు ?'' అని అడిగింది.

దానికి ఉమాకాంతుడు, ''ఆ నాడు జమీందారుగారొక్కరే నన్ను ధర్మకర్తగా వుండమని కోరారు. కాని, ఈనాడు బద్ధ శత్రువులైన రాజయ్యా, రంగయ్యలు కూడా కోరారు. అదీ, అసలైన పలుకుబడి !'' అన్నాడు.



# వాగుడుకాయ

తీర్థయాత్రలకు బయలుదేరిన జనం, ఒక కొత్త ఊరి సత్రంలో దిగారు. వాగుడుకాయగా పేరు మోసిన వరదయ్య, సత్రంలో కనిపించిన ప్రతివాడినీ, అన్ని వివరాలూ అడుగుతూ విసిగిస్తున్నాడు.

ఇదంతా కాస్త దూరంలో వున్న అరుగు మీద కూర్చుని చూస్తూ, ఈ వాగుడుకాయ నోరు మూయించడం ఎలానా అని ఆలోచిస్తున్న సింగయ్య అనే అతణ్ణి వరదయ్య సమీపించి, "ఏ ఊరండీ మీది? మిమ్మల్ని ఎక్కడో చూసినట్టుందే!" అన్నాడు.

వెంటనే సింగయ్య అందుకుని, "మాది విజయనగరం. మా నాన్నది రాజమహేంద్రవరం. మా మాతామహులది కొండవీడు. అసలు, మా పూర్వీకులు కర్నాటకదేశం నుంచి వచ్చారని చెబుతారు. పధ్నాలుగో శతాబ్దంలో కొండవీటిని పాలించిన అనవేమారెడ్డి దగ్గర ప్రధాన మంత్రిగా పనిచేసిన పద్మనందుడు, మా వంశంవాడే. ఆ వంశస్థులు నానా రకాలుగా చీలిపోయి, నానా దేశాలనూ పాలించారని చెబుతారు. సూర్యవంశీయుడైన శ్రీరామచంద్రుడు లంకకు వెళ్ళే ప్రయత్నంలో..." అంటూ చెప్పడం సాగించాడు.

వాగుడుకాయ వరదయ్య అదిరిపడిపోతూ, "ఇక చాలండి వివరాలు, వస్తాను!" అంటూ పైపంచ గట్టిగా దులిపి భుజాన వేసుకుని, సత్రం అరుగు దిగి, దూరంగా వున్న శివాలయం కేసి బయలుదేరాడు.

సత్రంలోని జనం, బతికించావన్నట్టుగా సింగయ్య కేసి సంతోషంగా చూశారు.

—ఎం. డి. సౌజన్య





# తానుతవ్విన గొయ్యి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో ఆయన వద్ద పింగళుడనే పురోహితుడుండేవాడు. ఆయన శరీరచ్ఛాయ పింగళవర్ణం, ఆయన తల బట్టతల, నోరు బోసినోరు. బోధిసత్వుడు తక్కారియుడనే యువకుడుగా పింగళుడికి శిష్యుడై విద్యాభ్యాసంచేస్తూ ఉంటున్నాడు.

రాజపురోహితుడైన పింగళుడికి ఒక బావమరిది ఉన్నాడు. ఆయన కూడా పింగళవర్ణమూ, బట్టతలా, బోసినోరూ కలవాడు. అంతేగాక పింగళుడితో సమానమైన విద్వత్తు కలవాడు కూడా. బావమరుదులిద్దరూ ఒకరికంటే మరొకరు గొప్పవారని తలచడంవల్ల ఇద్దరి మధ్యా బద్ధవైరం ఉంటూ వచ్చింది. తన బావమరిదిని ఎలాగైనా నాశనం చేద్దామనే దుర్బుద్ధితో పింగళుడు చాలా యత్నాలు చేశాడుగాని, అవేవి ఫలించలేదు.

చిట్టచివరకు పింగళుడు తన బావమరిదిని చంపెయ్యటానికి ఒక యుక్తి పన్నాడు. ఆయన రాజుగారి వద్దకు వెళ్ళి, "మహాప్రభూ, మన కాశీనగరం భారతదేశానికంతటికీ అత్యుత్తమ నగరం. తాము దేశంలోని రాజులందరిలోకీ చాలా గొప్పవారు. అలాటప్పుడు మన కోటలోనే నిర్మాణ లోపం ఉండటం శోచనీయం. మన దక్షిణ ద్వారం నిర్మించటంలో తప్పున్నది. అది మనకు ఎంతో అశుభం. మనకు దానివల్ల దేశంలో ఎంతో అపఖ్యాతి కూడానూ. ఆ దోషాన్ని వెంటనే సవరణ చెయ్యాలి," అని చెప్పాడు.

"అందుకుగాను మనం ఏం చేయాలి?" అని రాజుగారు పింగళుణ్ణి అడిగాడు.

"ఆ ద్వారాన్ని ముందు పడగొట్టాలి. తర్వాత, శుభప్రదమైన కలప తెచ్చి



మరొక ద్వారం తయారు చేయించాలి. అప్పుడు నగర దేవతలకు బలులు జరిపించి, శుభ ముహూర్తాన కొత్త ద్వారాన్ని నిలబెట్టాలి,'' అన్నాడు పింగళుడు.

రాజుగారు సమ్మతించాడు. ఆయన ఆజ్ఞతో పింగళుడు దక్షిణ ద్వారాన్ని పడగొట్టించాడు. దాని స్థానంలో ఏర్పరచటానికిగాను కొత్త ద్వారం త్వరగానే తయారయింది కూడా.

పింగళుడు రాజుగారి వద్దకు వెళ్ళి, ''మహారాజా, కొత్త ద్వారం తయారయింది. అది నిలబెట్టటానికి రేపు దివ్యమైన ముహూర్తం ఉన్నది. అవసరం అయిన బలి జరిపి ద్వారం నిలబెట్టటానికి తమ అనుమతి ఇవ్వండి!'' అన్నాడు వినయంగా.

''బలి ఇవ్వటానికి ఏమేమి ఏర్పాట్లు జరగాలి?" అని రాజుగారు అడిగాడు.

''పింగళ వర్ణమూ, బట్టతలా, బోసి నోరూ గల ఒక బ్రాహ్మణ్ణి బలి ఇవ్వవలసి ఉంటుంది, మహారాజా! ఈ ద్వారాన్ని సంరక్షించే మహాశక్తులను అలాటి బ్రాహ్మడి రక్త మాంసాలతో ముందుగా తృప్తిపరచాలి. ఆ తరవాత ఆ బ్రాహ్మణ్ణి అక్కడే పాతిపెట్టి, పాతిన చోట కొత్త ద్వారం నిలబెట్టాలి,'' అన్నాడు పింగళుడు.

''సరే, అలాంటి బ్రాహ్మణ్ణి వెతికి తెప్పించి, ద్వారం పెట్టించు!'' అన్నాడు రాజుగారు.

తనకు ప్రబల శత్రువైన బావమరిదిని హతమార్చటానికి రాజుగారి అనుమతి దొరికిందిగదా అని పింగళుడికి పరమానందం కలిగింది. ఆయన ఇంటికి వెళ్ళి తన భార్యతో, ''ఇదుగో, రేపటితో నీ అన్నకు ఆయువు మూడింది! వాణ్ణి కొత్త ద్వారానికి బలి ఇవ్వబోతున్నాను, చూసుకో!'' అని నిర్భయంగా ప్రగల్భాలు పలికాడు

''మా అన్ననే ఎందుకు బలి ఇవ్వాలి? దానికి రాజుగారు ఎలా ఒప్పుకున్నారు?'' అని పింగళుడి భార్య అడిగింది.

"ఫలానివాణ్ణి బలి యిస్తానని నేను రాజుగారితో చెప్పానా ఏమిటి? పింగళ వర్ణమూ, బోసి నోరూ గల బ్రాహ్మడు బలికి కావాలన్నాను, రాజుగారు సరే నన్నారు! రేపు నేను బయలుదేరి వెళ్లి మీ అన్నను చూపించి, వాడు బలికి పనికి వస్తాడంటాను. ఎవరు కాదంటారు?" అన్నాడు పింగళుడు.



పింగళుడి భార్యా తన భర్తతో ఇంకేమీ అనక, తన అన్నకు రహస్యంగా జరిగిన విషయమంతా కబురుచేసి, ఈ గండం తప్పుకోవాలంటే తెల్లవారే లోపుగా ఊరు దాటి వెళ్ళిపొమ్మని సలహా యిచ్చింది.

తనను చంపటానికి పింగళుడు చేసిన ప్రయత్నమంతా తెలియగానే ఆయన బావమరిది, తనలాగే పింగళ వర్ణమూ, బోసి నోరూ, బట్ట తలా ఉండేవారిని మరి ఒకరిద్దరిని కూడా కలుపుకుని, ఆ రాత్రే నగరం విడిచి వెళ్ళిపోయాడు!

మర్నాడు తెల్లవారుతూనే పింగళుడు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, బలికి కావలసినటువంటి మనిషి ఫలాని చోట ఉంటాడు, వాణ్ణి యిక్కడికి పిలిపించండి!" అని చెప్పాడు.

వెంటనే రాజుగారు తన భటులను పంపాడు. వారు పింగళుడు చెప్పిన చోటికి వెళ్ళి, అక్కడ ఉండే మనిషి ఆ క్రితం రాత్రే దేశం విడిచి వెళ్ళిపోయినట్టు తెలుసుకుని ఆ విషయం రాజుగారికి నివేదించటానికి తిరిగి వచ్చారు.

భటులు చెప్పిన సంగతి వినగానే రాజుగారు, "అరెరే, ఇప్పుడేం చేసేటట్టు? అలాటి లక్షణాలు గల బ్రాహ్మణ్ణి ఎలాగైనా సంపాదించి తీరాలి!" అన్నాడు.

దానికి మంత్రులు, "ఇదేమంత పెద్ద సమస్య, మహారాజా? మన పురోహితుడిలో అవసరమైన లక్షణాలన్నీ ఉన్నాయి గదా! ఆయననే బలి యిప్పించండి!" అని రాజుకు సలహా ఇచ్చారు.

"అలాగే చేయవచ్చుగాని, నాకు పురోహితుడు లేకుండాపోతే ఎలా?

అందుకు తగినవాడు మరెవడైనా ఉన్నాడా? ఆ సంగతి ముందు ఆలో చించండి," అన్నాడు రాజు.

"మన పురోహితుడి వద్ద తక్కారియు డనే శిష్యుడున్నాడు. అతను గురువు కన్న కూడా తెలివిగలవాడని పేరు పడ్డాడు. అతన్ని తమరు పురోహితుడుగా పెట్టుకోవచ్చు." అని మంత్రులు చెప్పారు.

వెంటనే రాజుగారు తక్కారియుణ్ణి పిలిపించి, "నిన్ను ఇకనుంచీ నా పురో హితుణ్ణిగా నియమిస్తున్నాను. నువు ఈ పింగళుణ్ణి శాస్త్రోక్తంగా బలి యిచ్చి, పాతి పెట్టించి, ఆయన మీదుగా ద్వారం పెట్టించు!" అని ఆజ్ఞాపించాడు.

తక్కారియుడు దక్షిణ ద్వారం వద్దకు బయలుదేరి వెళ్ళాడు. పింగళుణ్ణి యజ్ఞ పశువులాగా అలంకరించి చేతులూ, కాళ్ళూ బంధించి కొత్త ద్వారం వద్దకు చేరవేశారు. బలి జరిపే నిమిత్తమై, ద్వారం ఏర్పాటు కావలసినచోట, ఒక లోతైన గొయ్యి తవ్వి ఉన్నది. ఆ గోతి లోకి గురుశిష్యులిద్దరూ ప్రవేశించారు.

పింగళుడు వలవలా ఏడుస్తూ, "ఒరే శిష్యా! ఇంకొకరి కోసం తవ్విన గోతిలో నేనే ప్రవేశించానుగదరా!" అన్నాడు.

"స్వామీ, పనిగట్టుకొని పరులకు కీడు చేయాలని చూసేవాడు ఎప్పటికయినా తాను తీసుకున్న గోతిలో తాను పడక తప్పదు. మీరేమీ విచారించకండి. నేను రాజుగారి వద్దకు వెళ్ళి సరి అయిన ముహూర్తం అర్ధరాత్రిదాకా లేదని చెబు తాను. ఆ తరవాత ఏదో ఒక ఉపాయం చేసి మీ ప్రాణాలు కాపాడతాను!" అన్నాడు తక్కారియుడు.

అతను ఆ ప్రకారమే బలికి ముహూర్తం అర్ధరాత్రికి మార్పించాడు. ఆ రాత్రి చీకటిలో అతను పింగళుణ్ణి పారిపొమ్మని, ఒక చచ్చిన మేకను తెచ్చి గోతిలో పూడ్పించేసి, తెల్లవారే లోగా అక్కడ కొత్త ద్వారం ప్రతిష్ఠ చేయించాడు.





## రాజ్యతృష్ణ

జలాలుద్దీన్ ఖిల్జీ అనే సేనానాయకుడు సింహాసనం ఆక్రమించడంతో, బానిస వంశపు సుల్తానుల పరిపాలన అంత మైంది. జలాలుద్దీన్ డెభై ఏండ్ల వయసువాడు. బాల్బన్ మనుమడైన కైకోబాద్‌ను హత్య చేయించినవాడు అతడే అన్న వాదు వున్నది. జలాలుద్దీన్ 1290 వ సంవత్సరంలో అధికారానికి వచ్చాడు.

అతడికి యిద్దరు కొడుకులున్నారు. అయినా, మేనల్లుడేకాక, కుమార్తెను వివాహమాడిన కారణంగా అల్లుడు కూడా అయిన అల్లా ఉద్దీన్ అంటే జలాలుద్దీన్‌కు చాలా ప్రేమ. అతణ్ణి సుల్తాను కారా పరిపాలకుడుగా నియమించాడు. అల్లా ఉద్దీన్ తనకు సుల్తానంటే, ఎంతో భక్తి గౌరవాలున్నట్టు నటించేవాడు.





అల్లా ఉద్దీన్ రాజ్యతృష్ణ కలవాడు. అతడు సుల్తాను అనుమతి పొంద కుండానే సంపన్న రాజ్యమైన దేవగిరి మీద దాడి చేశాడు. (ఆ తరవాత అది దౌలతాబాదు అని పిలవబడింది) అపజయం తప్పదని భయపడి రాజు రామదేవుడు, అల్లా ఉద్దీనుకు ఎంతో బంగారం, విలువైన ముత్యాలూ, రత్నాలతోపాటు - గుర్రాలనూ, ఏనుగులనూ కూడా సమర్పించాడు.



తన అనుమతి లేకుండా పరరాజ్యాల మీదికి యుద్ధానికి వెళ్ళినందుకు అల్లా ఉద్దీను పైన సుల్తానుకు చాలా కోపం వచ్చింది. కాని, జిత్తులమారి అయిన అల్లా ఉద్దీను అతడికి తాను సంపాయించి సమర్పించనున్న విలువైన వస్తువులా, యితర సంపదలా జాబితా పంపించాడు. ముసలి సుల్తాను శాంతుడై, వాటిని తన సొంతం చేసుకునేందుకు ఆత్రపడసాగాడు.

అల్లా ఉద్దీను కొల్లగొట్టి తెచ్చిన ధనం కోసం సుల్తాన్ జలాలుద్దీన్ కారాకు బయలుదేరాడు. అతడు నదిలో పడవ ప్రయాణం చేస్తూండగా పెద్ద సైన్యం కాపలాగా నదికి యిరువైపుల వున్న గట్ల వెంట కదిలింది. అల్లా ఉద్దీను ఏదైనా కుట్ర చేయబోతున్నాడేమో అని మంత్రులు సుల్తానుకు చెప్పి చూశారు. కాని, జలాలుద్దీన్‌కు వాళ్ళ మాటలు తలకెక్కలేదు.






జలాలుద్దీన్ కారా చేరగానే, అల్లా ఉద్దీను పంపిన కుట్రదారుడొకడు అతణ్ణి కలుసుకుని, "మహాప్రభో! ప్రభువులకు తనపై కోపంగా వున్నదనీ, పెద్ద సైన్యంతో వస్తున్నారని తెలిసి అల్లా ఉద్దీను భయకంపితుడై వున్నాడు. ఆత్మహత్య తప్ప మరొక మార్గం లేదనుకుంటున్నాడు. తమరు ఒంటరిగా దయచేస్తే, అతడు తన ప్రాణాలు నిలిచినట్టు భావిస్తాడు," అని నమ్మబలికాడు.

సైన్యాన్ని నది దగ్గిరే వుండమని ఆజ్ఞాపించి, కొద్దిమంది అంగ రక్షకులతో బయలుదేరాడు సుల్తాను. అల్లా ఉద్దీను సోదరులలో ఒకడు సుల్తానుతో, "ప్రభూ, ఇంతమంది అంగరక్షకులతో రావడం చూసి అల్లా ఉద్దీను ప్రాణ భయంతో వణికిపోతున్నాడు," అన్నాడు. సుల్తాను అంగరక్షకులను వెనక్కు తిరిగి పొమ్మన్నాడు.





తరవాత సుల్తాను అల్లా ఉద్దీను సోదరుడి వెంట నది దాటి అవలిగట్టుకు చేరాడు. అక్కడ అల్లా ఉద్దీను సైనికులు సోలుపులు తీరివుండడం చూసి, ఆశ్చర్యపోయాడు. "ఈ సైనికులంతా తమకు గౌరవాభివందనం చేసేందుకు నిలబడ్డారు," అని చెప్పాడు అల్లా ఉద్దీను సోదరుడు సుల్తానుతో. అతడు కూర్చునేందుకు ఒక ఉన్నతాసనం చూపాడు.

కొద్దిసేపట్లో అల్లా ఉద్దీను సుల్తాను దగ్గిరకు వచ్చి పాదాభివందనం చేశాడు. సుల్తాను ఆప్యాయంగా అల్లా ఉద్దీను తలను తాకాడు. ఆ వెంటనే అల్లా ఉద్దీను ముసలి సుల్తాను రెండు చేతుల్నీ తన బలమైన గుప్పెళ్లల్లో బిగించాడు. అల్లా ఉద్దీను అనుచరులు సుల్తానును కత్తులతో పొడిచారు. సుల్తాను అక్కడికక్కడే మరణించాడు.





ఆ తరవాత అల్లా ఉద్దీను సుల్తాను జలాలుద్దీన్ కొడుకులనూ, ఆంతరంగిక మిత్రులనూ చంపించి, 1296 లో ఢిల్లీ సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు. అతడు దేశాన్ని ఆక్రమించవచ్చిన మంగోలులను తరిమికొట్టడమేకాక, చాలామంది రాజులను ఓడించి తన రాజ్యాన్ని విస్తరింపచేశాడు. అంతకు ముందు ఢిల్లీని పాలించిన సుల్తాను లందరికన్న అల్లా ఉద్దీను బలవంతు డనిపించుకున్నాడు.

అల్లా ఉద్దీను తన దర్బారులో వున్న ప్రతి ఒక్కణ్ణీ అనుమానించేవాడు. ఒకసారి అతడు తన సలహాదారులతో కలిసి మద్యపానం చేస్తున్నాడు. రాత్రి బాగా పొద్దుపోయింది. ముఖ్యోద్యోగి ఒకడు మిగతావారిని యిక వెళ్ళడం బావుంటుందన్నట్టుగా సైగ చేశాడు. ఇందులో ఏదో కుట్ర వున్నదన్న అను మానంతో అల్లా ఉద్దీను సైగ చేసినవాడి తోపాటు, మిగిలిన వారిని చంపించాడు.









మర్నాటి ఉదయానికి తాగిన మత్తు దిగిపోగానే అతడికి తాను చేసిన పొర బాటు తెలిసివచ్చింది. అతడు పశ్చాత్తాప పడి, యింత దారుణానికీ కారణం మద్యం అని గుర్తించాడు. వెంటనే అతడు రాజ్యంలో మద్యపానాన్ని నిషేధిస్తూ ఉత్తరువులు జారీ చేశాడు. సైనికులు గుంపులుగా బయలుదేరి కంటబడిన పానశాలలకన్నిటికీ నిప్పు పెట్టి, ధ్వంసం చేశారు.

# భోజనప్రియుడు

ఒక జమీందారు తన తల్లిగారి సాంవత్సరీకానికి పెద్ద సంతర్పణ ఏర్పాటుచేసి, ఇరుగుపొరుగు ఊళ్ళవాళ్ళను కూడా ఆహ్వానిస్తూ దండోరా వేయించాడు. జనం తండోపతండాలుగా వచ్చారు.

జనానికి వడ్డనవాళ్ళు భోజనం వడ్డిస్తూండగా, అక్కడికి దుడ్డుకర్రలతో వచ్చిన జమీందారు నౌకర్లు, "ఎవరూ, ఏ పదార్థాన్నీ మరొకసారి వడ్డించమని అడక్కూడదు. అలా అడిగినవాళ్ళకు, యిరవై యేసి దుడ్డుకర్రల దెబ్బలు శిక్షగా జమీందారుగారు నిర్ణయించారు," అని చెప్పారు.

పప్పూ, కూరలూ, పాయసం ఎంత రుచిగా వున్నా, యీ కర్ర దెబ్బలకు భయపడి ఎవరూ, వడ్డనవాళ్ళను ఆ రుచిగల పదార్థాలు మరొకసారి వడ్డించమని అడగలేదు. కాని, వాళ్ళల్లో రామయ్య అనే భోజనప్రియుడు, తరవాత ఏమైతే అదవుతుందని తెగించి, వడ్డనవాళ్ళను మరొకసారి పాయసం వడ్డించమని అడిగాడు.

రామయ్య మాటలు విన్న తోటివాళ్ళంతా తారెత్తిపోయారు. వడ్డనవాళ్ళు మారు మాట్లాడకుండా, అతడికి పాయసం వడ్డించారు. భోజనం పూర్తయాక నౌకర్లు, రామయ్యను తీసుకుపోయి జమీందారు ముందు నిలబెట్టి, సంగతి చెప్పారు.

జమీందారు పరమానందంతో, "రామయ్యా, నిర్భయుడైన నీలాటి భోజనప్రియుడి కోసమే చూస్తున్నాను! సంవత్సరం కిందట మా అమ్మగారు తీర్థానికి కాశీ వెళ్ళి, గంగానదిలో స్నానం చేస్తూ కొట్టుకుపోయి, దూరాన ఒక నిర్జనప్రదేశాన ఒడ్డుచేరి, ఆకలిబాధతో స్వర్గస్థురాలైంది. ఆమె ఆత్మకు తృప్తికలగాలంటే, సంవత్సరం పాటు మంచి భోజనప్రియుడికి ఆతిథ్యం యివ్వాలని పురోహితులు చెప్పారు. నువ్వు దొరికావు!" అన్నాడు.

—వెంపటి సావిత్రి





# దక్షిణ సిరి

మల్లవరం అనే ఊరి పొలిమేరలలో, ఒక పాడుబడిన పురాతన అమ్మవారి ఆలయం వుండేది. ఆలయాన్ని ఎంతో కాలంగా ప్రజలు పూజాపునస్కారాలు లేకుండా వదిలివేయడంతో, లోపలి భాగమంతా బూజు, దుమ్మూధూళితో నిండిపోయింది. ఆలయ పైభాగాన రకరకాల పిచ్చిమొక్కలు చిత్తవొత్తుగా పెరిగాయి.

ఉన్న ఊరి వాళ్ళతో పడక, గుడి పూజారి పని పోగొట్టుకున్న పరంధామయ్య అనే అతను భార్యా, యిద్దరు చిన్న పిల్లలతో బతుకుతెరువు వెతుక్కుంటూ బయలుదేరి, మల్లవరం పొలిమేర ప్రాంతాలు చేరాడు. అతడికి పాడుబడిన అమ్మవారి ఆలయం కంటబడింది.

ఆ ఆలయాన్ని చూస్తూనే పరంధామయ్యకు ఒక ఆలోచన వచ్చింది. అతడు భార్యతో, ''చూశావా, ఏదో అమ్మవారిని వెలివేసినట్టు, పక్క గ్రామంవాళ్ళు, యీ చాయలకే వస్తున్నట్టులేదు. మనం ఆలయాన్ని శుభ్రపరిచి యిక్కడే స్థిరపడదాం. అమ్మవారు మనను కరుణించక పోదు,'' అన్నాడు.

పూజారి భార్య అందుకు సంతోషంగా ఒప్పుకున్నది. పిల్లలూ, భార్యా, పరంధామయ్యా కలిసి వారం రోజులు తిరక్కుండానే ఆలయాన్ని శుభ్రంచేసి, అమ్మవారికి కొత్త దుస్తులు కట్టబెట్టి అలంకరణ చేశారు. తరవాత ఒకనాటి ఉదయం తుప్పుపట్టిన ఆలయపు గంటను గణగణ మోగించారు.

అమ్మవారి ఆలయంలో ఒక పూజారి చేరాడనీ, ఆలయం బాగుపడిందనీ తెలుసుకున్న గ్రామంలోని భక్తులు రోజూ ఆలయానికి వచ్చి పోసాగారు. వాళ్ళు అక్కడ కానుకలుగా యిచ్చివెళ్ళే డబ్బులతో

రాంబాబు



పరంధామయ్య కుటుంబం సుఖంగా బతకసాగింది.

నాలుగైదు నెలలు గడిచాయి. ప్రారంభంలో కొత్త ఒక వింతగా వచ్చిన భక్తుల సంఖ్య క్రమంగా తగ్గిపోసాగింది. పరంధామయ్యకు తిరిగి గడ్డు రోజులు మొదలయ్యాయి. అతడు ఒకనాటి రాత్రి భార్యతో, బతుకుతెరువుకు మల్లవరం వదిలి, మరేదైనా గ్రామం పోదామని చెప్పాడు. సంగతి తెలుసుగనక, ఆమె సరేనని తలవూపింది. తరవాత అందరూ నిద్రపోయారు.

ఒక రాత్రివేళ అమ్మవారు కలలో పరంధామయ్యకు ప్రత్యక్షమైంది, అతడు ఎంతో భక్తితో ఆమె ముందు మోకరిల్లి, "అమ్మా, నా వల్ల ఏమైనా అపరాధం జరిగితే మన్నించు! నా పొట్టకోసం శిధిలావస్థలో వున్న, నీ ఆలయానికి ఒక రూపు దిద్దాను. కానీ, నాకు మళ్ళీ పొట్టగడవని రోజులు ఎదురయినై. అందువల్లనే, యీ ఊరు వదిలిపోవాలనుకుంటున్నాను. నీ కిష్టం లేకపోతే, యిక్కడే వుండిపోతాను," అన్నాడు.

ఆ మాటలకు దేవి మందహాసంచేసి, "నా ఆలయానికి తిరిగి అలనాటి కళ తెచ్చిన నువ్వంటే, నా కెంతో వాత్సల్యం. నే నిప్పుడు నిన్ను అనుగ్రహించడానికి వచ్చాను. ఈ ఆలయం రేపు సూర్యోదయ సమయంలో నిలువునా కూలిపోతుంది. నువ్వు వెంటనే, నా విగ్రహం పాదాలకింద తవ్వు. అక్కడ, ఆలయం ఉచ్చదశలో వున్నప్పుడు నేను ధరించిన నగలూ, ఆభరణాలూ వున్నవి; వాటిని తీసుకుని మరెక్కడికైనా పోయి భార్యా, బిడ్డలతో సుఖంగా జీవించు. నేనూ, యీ ఆలయాన్ని విడిచిపోతున్నాను," అని చెప్పి అదృశ్యమైంది.

పరంధామయ్య నిద్ర మేల్కొని, భార్యకు తన కల గురించి చెప్పాడు. ఇద్దరూ కలిసి విగ్రహం పాదాలకింద తవ్వగా, అక్కడ అమ్మవారు చెప్పినట్టే

చాలా నగలు దొరికాయి. వాళ్ళు వాటిని జాగ్రత్తగా మూట కట్టుకుని, సంతోషంగా పిల్లలిద్దరితో ఆలయం బయిటికి వచ్చారు. ఆ సమయంలో సూర్యోదయం అవుతున్నది.

అంతలో ముగ్గురు దొంగలు అక్కడికి వచ్చి, పరంధామయ్యకు కత్తులు చూపించి, "నీ చేతిలో వున్న మూటా, యితర పాత్రసామానులూ గొడవ చెయ్యకుండా యిచ్చెయ్యి," అన్నారు.

ఇన్నాళ్ళకు అమ్మవారి అనుగ్రహంవల్ల ప్రాప్తించిన సిరి, దొంగలపాలవుతున్నందుకు పరంధామయ్య చాలా బాధపడ్డాడు. అయినా, తనకు అనుభవించే యోగం లేదని మనసును సరిపెట్టుకుని అతడు, దొంగలకు నగలమూట యివ్వబోతూంటే, అతడి భార్య చప్పున మూట లాక్కుని, ఆలయంలోకి విసిరివేసింది. మూట కింద పడుతూనే అందులోని బంగారు నగలు నేలమీద చెల్లాచెదురై ధగధగా మెరవసాగినై.

అంత బంగారం చూడగానే దొంగల కళ్ళు ఆనందంతో జిగేలుమన్నవి. వాళ్ళు చిన్నగా చప్పట్లుచరిచి, ఒక్క దూకున ఆలయంలోకి వెళ్ళారు. ఆ సమయంలో ఉదయ సూర్యకిరణాలు ఆలయం మీద ప్రసరించినై. మరుక్షణం ఆలయం పెద్ద శబ్దంతో కూలిపోయింది. దొంగలు ముగ్గురూ రాళ్ళకింద పడి మరణించారు.

పరంధామయ్య అమ్మవారి మహత్తుకు అచ్చెరువు చెందాడు. అతడు కూలిన రాళ్ళను తొలగించి, అమ్మవారి నగలను ఏరి ఒక మూటగా కట్టి భార్యకిస్తూ, "ఆ తల్లి దయవల్లే, నీకు సమయానికి నగల మూటను ఆలయంలోకి విసిరివేయాలన్న బుద్ధి కలిగింది! అలా కాకపోతే, యీ సిరి మనకు దక్కేది కాదు," అన్నాడు.

తరవాత అతడు అమ్మవారిని మరోసారి ప్రార్థించుకుని, భార్యా బిడ్డలతో మరొక ఊరుకు ప్రయాణమయ్యాడు.





# దయ్యాల దాగుడుమూతలు

అడవికి దాపుల్లో వున్న ఐలవరం అనే కుగ్రామంలో విహారి వాళ్ళది, ఒకప్పుడు కలిగిన కుటుంబం. అయితే, విహారి తండ్రి వ్యవసాయంలో కలిసిరాక, వ్యాపారంలో దిగి, అందులోనూ బాగా నష్టపోయి, చనిపోయేనాటికి ఒక్క ఎకరం పొలం మాత్రం మిగిల్చాడు.

తండ్రి పోయిన కొద్ది కాలానికే తల్లి కూడా గతించడంతో, విహారిని అతడి అవ్వ పెంచి పెద్ద చేసింది. అవ్వ ఎంత పోరినా పొలం పనికి పోక, విహారి గ్రామంలో ఉట్టినే తిరుగుతూ కాలక్షేపం చేస్తూండేవాడు.

తన మనమడికి పెళ్ళి చేస్తే బాధ్యతలు తెలిసిరాగలవన్న నమ్మకంతో విహారి అవ్వ అతడికి పెళ్ళి సంబంధాలు చూడ సాగింది. ఆ సంగతి తెలియగానే విహారికి చప్పున ఒక ఆలోచన వచ్చింది.

వాళ్ళ ఇంటి పక్కనే రామనాథం అనే చిన్న రైతు వున్నాడు. అతడి కూతురు విశాలి వీధిబడిలో విహారితోపాటు చదువుకున్నది. తల్లి లేని ఆ పిల్ల ఇంటి పనులన్నీ చక్కగా చేయగలదు. పెళ్ళంటూ చేసుకుంటే, ఆ అమ్మాయినే చేసుకోవాలనుకున్నాడు, విహారి.

ఒకనాడు విహారి, రామనాథాన్ని చూడబోయి, తాను విశాలిని పెళ్ళాడదలిచినట్టు చెప్పాడు. ఆ మాటకు రామనాథం మొదట ఆశ్చర్యపోయి, తరవాత పట్టరాని కోపంతో, "సోమరిపోతుకు పెళ్ళేమిటి? ముందు, మీ నాన్న వదిలిపోయిన ఆ ఎకరం పొలం చేజారిపోకుండా చూసుకో, అదే పదివేలు!" అంటూ గట్టిగా చీవాట్లు పెట్టాడు.

వంటగదిలో వున్న విశాలి యిదంతా విన్నది. అవమాన భారంతో ఇంటికి తిరిగి

మాచిరాజు కామేశ్వరరావు

వచ్చిన విహారికి అర్ధరాత్రి అయినా నిద్ర పట్టలేదు. అతడికి జీవితం మీద విరక్తి కలిగి, అడవిలో ఏ విషసర్పానికో, క్రూరమృగానికో ఆహుతి అయిపోదా మనుకుంటూ ఇల్లు వదిలి, అడవి దారి పట్టాడు.

చీకటిలో అతడు ఎంత దూరం నడిచినా క్రూరమృగాలు ఎదురుపడలేదు గాని, పక్కనే వున్న గుబురు చెట్లలో నుంచి ఎవరో దాగుడుమూతలాడుతున్నట్టు కేకలు వినిపించినై. విహారి ఒక క్షణం భయంతో వణికిపోయి, ఒక చెట్టు చాటుకు వెళ్ళి నిలబడ్డాడు.

భీకరంగా వున్న తల్లి దయ్యాం ఒకటి, ఒక పిల్ల దయ్యం కళ్ళు మూసి, 'దాగుడు మూత - దండాకోర్' అంటూ అరిచింది. మూడు పిల్ల దయ్యాలు దాక్కోడానికి చెట్ల చాటుకు పరుగులు తీశాయి. తల్లి దయ్యం మొహం మీదినుంచి చేతులు తీయగానే, పిల్లదయ్యం పారిపోయి దాక్కున్న మిగతా పిల్లదయ్యాల కోసం బయలుదేరింది.

అది చెట్లచాటున నక్కుతూ కొంత దూరం వచ్చి, విహారి కంటబడగానే, "అమ్మోయ్, మనిషి!" అంటూ కుప్ప కూలిపోయింది.

ఆ వెంటనే దయ్యాలన్నీ పరుగు, పరుగున వచ్చి విహారిని చుట్టుముట్టాయి. విహారికి ప్రాణభీతితో మూర్ఛ వచ్చినంత పనైంది.



తల్లి దయ్యం విహారి కేసి ఆశ్చర్యంగా చూసి, పిల్ల దయ్యాలను దూరంగా పోయి ఆడుకోమని చెప్పి, "పిశాచాలు తిరిగే వేళ అడవి మధ్యకు రావడానికి నీ కెంత ధైర్యం! సరే, ఎందుకు వచ్చావో నిజం చెబితే వదిలేస్తాను. అబద్ధాలు పలికావో, నువ్వు పిల్ల దయ్యాలను గాడిదలా మోస్తూ బతికున్నంత వరకూ, యీ అడవిలోనే కాలం గడపవలసివస్తుంది," అన్నది.

ఆ మాటలతో విహారికి కొంత ధైర్యం కలిగింది. అతడు తన పేదస్థితి గురించి దయ్యానికి ముందుగా చెప్పి, తరవాత విశాలిని పెళ్ళాడతానంటే కాబోయే మామ రామనాథం చేసిన అవమానం వివరించి, "నేనే ధనవంతుణ్ణయి వుంటే, ఆ రామనాథం యిలా మాట్లాడే వాడా ? విశాలి నా భార్య కానప్పుడు నే బతికెందుకు! ప్రాణాల మీద ఆశ వదులుకునే, యీ అడవికి వచ్చాను," అన్నాడు.

దయ్యం విహారి కేసి కళ్ళు చికిలిస్తూ చూసి, "ఓస్, యింతేనా! ఆ డబ్బేదో కాకితో కబురంపితే పంపేదాన్ని కదా," అంటూ పక్కన వున్న చెట్టు తొర్రలోంచి ఒక తోలుసంచీ బయటికితీసి, గుప్పెళ్లతో బంగారు కాసులు దాని నిండుగా పోసి, విహారికిస్తూ, "నువ్వేదో కథ అల్లడం కాక, నిజమే చెప్పావనుకుంటున్నాను. ఈ బంగారం తీసుకుపోయి, నువ్వు కావాలనుకున్న పిల్లను పెళ్ళాడి హాయిగా బతుకు," అన్నది.





విహారి దయ్యానికి వంగి దణ్ణం పెట్టి, సంచీతో ఇంటిదారి పట్టాడు. అతడు గ్రామం చేరేసరికి తెల్లవారిపోయింది.

అతడు సరాసరి రామనాథం ఇంటికి వెళ్లి, డబ్బు సంచీని అతడికి చూపుతూ, ''నా కున్న ముప్తై ఎకరం పొలాన్నీ, నా సోమరితనాన్నీ తెగ హేళన చేశావు. ఇదిగో, సంచి నిండు బంగారు కాసులు తెచ్చాను; నీ కళ్ళు చెదిరిపోగలవు. ఇప్పుడు విశాలిని నా కిచ్చి చేసేందుకు, నీ కెలాంటి అభ్యంతరం వుండదను కుంటాను,'' అన్నాడు.

రామనాథం ఆశ్చర్యపోతూ, తోలు సంచీ తీసుకుని మూత విప్పాడు. అ మరుక్షణం బుస్సుమంటూ పెద్ద ధ్వనితో గాలి బయిటికి వచ్చింది. సంచీ ఖాళీగా వున్నది. ''ఇందులో గాలి తప్ప మరేం వున్నట్టు లేదు. ఛీ, ఛీ!'' అంటూ రామనాథం సంచీని దూరంగా విసిరివేశాడు.

విహారి నిర్ఘాంతపోతూ సంచీని చేతికి తీసుకుని, లోపలికి చూశాడు. అందులో బంగారు కాసులు లేవు.

''ఏమిటీ మాయ! ఈ సంచీ నిండా దయ్యం బంగారు కాసులు పోయడం యీ కళ్ళతో నేను చూస్తినే,'' అంటూ విహారి ఏడ్పు ముఖం పెట్టాడు.

''అబద్ధం చెప్పినా, అతికినట్లుం డాలి. పద పద, అవతల నాకు బోలెడంత పని!'' అంటూ రామనాథం మరొకసారి చీదరించుకున్నాడు.

విశాలి తలుపు వారగా నిలబడి యిదంతా చూస్తూనే వున్నది.

విహారి గట్టిగా తలగోక్కుని, ''దయ్యం అయితే మాత్రం మరీ యింత పచ్చి మోసమా! ఈ రాత్రే మరొకసారి అడవికి వెళ్ళి, దాన్ని జుట్టు పట్టుకుని నిలదీసి అడుగుతాను,'' అంటూ ఇంటికి వెళ్ళాడు

ఆ రాత్రి విహారి అడవి చేరేసరికి, ఎప్పటిలా దయ్యాలు దాగుడుమూతలాడు తున్నాయి. అతడు కోపంగా తల్లి దయ్యం దగ్గిరకు పోయి, ''నువ్వు పచ్చి మోస

కారివి! బంగారం అని చెప్పి, సంచిలో యింతగాలి ఊది యిస్తావా?'' అన్నాడు.

తల్లిదయ్యం వచ్చేనవ్వు ఆపుకుంటూ, ''నీకు దాగుడుమూతల ఆట తెలుసు గదా? ఎదురుగా వున్న వాళ్ళు కళ్ళు మూసి తెరిచే లోపల మాయం అయి పోతారు. నేనూ, నీతో దాగుడుమూతలాట ఆడాను! నిరాశతో రాత్రి నువ్వు ఆత్మ హత్యకు పాల్పడేందుకు, ఈ అడవికి వచ్చావు. ఆ ఆవేశం తగ్గించేందుకే, నీకు ఉత్తుత్తి బంగారం బహూకరించాను. చచ్చి సాధించేదేమీ వుండదు. మాలా దయ్యం బతుకు తప్ప.. ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకుని ఇంటికి తిరిగిపోయి, వున్న ఎకరం పొలానికి తోడుగా మరి కొంత పొలం కౌలుకు తీసుకుని, వ్యవ సాయం చేసుకుంటూ హాయిగా బతుకు. భర్త ఏ సోమరిపోతో లేక దయ్యాలు, భూతాల నుంచి డబ్బుతెచ్చే వాడో కాక, కష్టపడి సంపాయించే వాడంటే భార్య గౌరవంగా చూసుకుంటుంది.'' అన్నది.

ఆ మాటలతో విహారికి తానింతకాలంగా గడిపిన జీవితంపట్ల ఏహ్యభావం కలిగింది. అతడు తన కళ్ళు తెరిపించిన దయ్యానికి కృతజ్ఞతా భావంతో నమస్కరించబోయే సరికి, అది కాస్తా మాయమై పోయింది.

విహారి వెంటనే అక్కణ్ణించి కదిలి ఇల్లు చేరేసరికి, వాకిట్లో నిలబడి వున్న విశాలి, ''డబ్బు బిచ్చమాడడానికి, యింత అర్ధరాత్రి దయ్యాల దగ్గిరకు వెళ్ళా వన్నమాట!'' అన్నది.

విహారి ఉలిక్కిపడి, ''అదంతా గతం. ఈనాటినుంచీ ఒళ్ళొంచి వ్యవసాయ ప్పనుల్లో దిగబోతున్నాను,'' అన్నాడు.

విశాలి ఏదో అనబోయేంతలో రామ నాథం ఇంట్లోంచి బయటికి వస్తూ, ''ఈ మాత్రం బుద్ధి నీకు లోగడే వుంటే, నా కూతుర్ని నీ మనవడికి చేసుకోమని, మీ అవ్వ దగ్గిరకు ఏనాడో వచ్చి వుండే వాణ్ణి!'' అన్నాడు.

ఆ మాటలకు విహారితోపాటు విశాలి కూడా పరమానందం చెందింది.






# వడ్డీలేని అప్పు

ధర్మవరంలో వుండే వడ్డీవ్యాపారి చండీదాసు, ఆ చుట్టుపక్కల గ్రామాల్లో కూడా పేరుమోసినవాడు. అతడు అప్పు తీసుకున్న వాళ్ల నుంచి విపరీతమైన వడ్డీలు వసూలు చేస్తాడనీ, ఆ కారణంవల్ల చాలా మంది చితికిపోయారనీ చెప్పుకునేవారు.

ఒకసారి దేవయ్య అనే అతను, చండీదాసు దగ్గిరకు పోయి, తన కుమార్తెకు పెళ్ళి చేయబోతున్నానని చెప్పి, వెయ్యి రూపాయలు అప్పు అడిగాడు. దేవయ్య తన గ్రామస్థుడే గనక, చండీదాసుకు అతడికున్న ఆస్తిపాస్తుల్ని గురించి తెలుసు.

"నీకు చిన్న పూరిగుడిసె తప్ప, మరే ఆస్తీలేదు. తీసుకున్న వెయ్యిరూపాయలు కాదుగదా, దాని వడ్డీ కూడా తీర్చలేవు. నీ గుడిసె విలువ రెండు వందలకు మించదు. మళ్ళీ ఏనాడూ అప్పు కోసం రాకు," అన్నాడు చండీదాసు.

అప్పు యివ్వకపోగా, తన పేదరికాన్ని గురించి ఈసడిస్తూ మాట్లాడినందుకు దేవయ్య, చండీదాసును మనసులోనే తిట్టుకుంటూ యింటికి బయలుదేరాడు. దారిలో అతడికి గ్రామాధికారి ఎదురయ్యాడు.

దేవయ్య, అతడికి జరిగిన సంగతి చెప్పాడు. గ్రామాధికారి సౌమ్యుడు; గ్రామంలో వున్న పదిమందీ ఉన్నంతలో సుఖంగా బతకాలని కోరుకునేవాడు.

ఆయన బాగా ఆలోచించి దేవయ్యకు ఒక ఉపాయం చెప్పి, "నా ఉపాయం పారితే, నలుగురికీ మేలు తప్ప, కీడంటూ ఎవరికీ జరగదు. చండీదాసుక్కూడా ఒక మంచి పాఠం నేర్పినట్టవుతుంది," అన్నాడు.

వారం తర్వాత దేవయ్య తన దగ్గిరకు మరొకసారి రాగానే చండీదాసు అయి

షేక్ గాలిబ్

ష్టంగా ముఖంపెట్టి ఏదో చెప్పబోయేంతలో దేవయ్య అందుకుని, ''ఇది నా కూతురు పెళ్ళి, వెయ్యి రూపాయిల అప్పు సంగతి కాదు. రాజుగారి కొలువులో మంచి ఉద్యోగంలో వున్న తన స్నేహితుడికి రెండువేలు లంచం యిస్తే, నా కొడుక్కు నెలకు అరువందల రూపాయిల జీతం మీద అక్కడ ఉద్యోగం యిప్పిస్తానని గ్రామాధికారి చెప్పాడు. ఎంత వడ్డీ అయినా ఫర్వాలేదు, రెండు వేలు సర్దు బాటు చెయ్యండి,'' అన్నాడు.

చండీదాసు ఒక్క క్షణం ఆశ్చర్య పోయి, అంతలోనే ఏదో ఆలోచన రాగా దేవయ్యను గట్టిగా చీదరించుకుని పంపేసి, గ్రామాధికారిని చూడబోయాడు.

"అయ్యా, తమకు రాజుగారి కొలువులో పలుకుబడిగల స్నేహితుడున్నట్టు యీ మధ్యనే తెలిసింది. నేను చేసే వడ్డీ వ్యాపారంలో అనేక లావాదేవీలు వస్తుంటవి. రాజుగారి కొలువులో నా వాడంటూ ఒకడుండటం అవసరం. రెండు వేలు-లంచం అనండి, పారితోషికం అనండి, యిచ్చుకుంటాను. మా వాడికి అక్కడ ఉద్యోగం అయేలా చూడ గలరా?'' అంటూ చండీదాసు రెండు వేల రూపాయిల మూట గ్రామాధికారి ముందు పెట్టాడు.

గ్రామాధికారి హుందాగా తలాడించి, ''అలాగే ప్రయత్నిస్తాను. కాని, పని జరిగేదీ లేందీ తెలిసేందుకు ఆరు నెలలో,



సంవత్సరమో పట్టవచ్చు. అందుకు యిష్టమేనా ?'' అన్నాడు.

''అంతా తమ దయ. సెలవు !'' అని, చండీదాసు వెళ్ళిపోయాడు.

గ్రామాధికారి ఆ మర్నాడే దేవయ్యకు వెయ్యి రూపాయిలిచ్చాడు. మిగిలిన వెయ్యి రూపాయిలూ, కాడెద్దుల్ని కొనేందుకు డబ్బు లేక అవస్థపడుతున్న ఒక రైతుకు తక్కువవడ్డీకి అప్పు యిచ్చాడు.

ఆ తరవాత చండీదాసు రాజుగారి కొలువులో తన కొడుకు ఉద్యోగం మాట ఏమిటంటూ గ్రామాధికారి చుట్టూ అనేక మార్లు తిరిగాడు. ప్రతీసారీ గ్రామాధికారి, తన స్నేహితుడు గట్టిగా ప్రయత్నిస్తున్నాడనీ, పని జరిగే అవకాశం వున్నదనీ సర్ది చెప్పి పంపుతుండేవాడు.

ఇలా సంవత్సరం గడిచింది. గ్రామాధికారి దగ్గిర వెయ్యి రూపాయిలు అప్పు తీసుకున్న రైతు ఒకనాడు ఆయన ఇంటికి వచ్చి, ''తమరు ఆపదలో నన్ను ఆదుకున్నారు. మంచి తరుణంలో ఎడ్లను కొనుక్కోగలిగాను. వ్యవసాయం లాభసాటిగా సాగింది. తమరిచ్చిన వెయ్యి రూపాయిలూ, దాని వడ్డీకి మరి కొంత కలిపి రెండు వేలు యిస్తున్నాను,'' అని డబ్బిచ్చి వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడే గ్రామాధికారి చండీదాసును పిలిపించి, తన స్నేహితుడివల్ల పని కాలేదనీ, అందువల్ల యిచ్చిన డబ్బు రెండు వేలూ తిరిగి పుచ్చుకోమనీ చెప్పి, డబ్బు యిచ్చేశాడు.

ఇంత జరిగాక చండీదాసుకు, గ్రామాధికారి మీద అనుమానం కలిగింది. అతడికి దారిలో దేవయ్య ఎదురయ్యాడు.

చండీదాసు, దేవయ్యకు గ్రామాధికారి చేసిన పని గురించి చెప్పి, ''ఇంత కాలంగా ఏదో పెద్దమనిషి అనుకుంటున్నాను. సంవత్సర కాలం నా రెండు వేల రూపాయిలూ వడ్డీకి తిప్పి, లాభం సంపాయించివుంటాడు !'' అన్నాడు.

దేవయ్య చిన్నగా నవ్వి, తన దారిన వెళ్ళిపోయాడు.






గజానన పండితుడి ఇంట కామధేనువు లాంటి గంగిగోవు ఉన్నది. నందుడు అనే వాడు దాని బాధ్యతలు నిర్వహిస్తూ, గజానన పండితుడికి రోజూ చిక్కటి పాలు పితికి తెచ్చి యిచ్చేవాడు. స్వర కేసరి నందుణ్ణి లోబర్చుకొని, వాడు చెయ్యవలసినదంతా నూరిపోశాడు.

గణపతి నవరాత్రి ఉత్సవాలకు కుమార్తెనూ, అల్లుణ్ణీ, మనుమడు గణేశ భట్టునూ తీసుకురావడానికి దగ్గిరలోనే ఉన్న కళ్యాణినగరానికి గజాననుడి భార్య వెళ్ళి ఉన్నది.

గజాననుడి అమరగానాన్ని విని తరించడానికి దూరదూరాల నుంచి రసజ్ఞులైన శ్రోతలు వాతాపినగరానికి చేరుకొంటున్నారు. అనాడే ప్రారంభ దినం. వాతాపి గణపతి ఆలయప్రాంగణంలో గజాననుడు తొలి పాట వినిపించవలసిన రోజు, వినాయక చతుర్థి!

వేకువనే నందుడు స్వరకేసరి చెప్పిన ప్రకారంగా లోటాలో ఉన్న నీళ్ళలో పితికి తెచ్చిన పాలు కొన్ని పోసి, లోటాను అలాగే తీసుకెళ్ళి గజాననుడికి యిచ్చాడు.

గజాననుడు లోటాలోని నీళ్ళపాలను జూసి నివ్వెరపడి, ''ఇదేమిటి నందా! ఎన్నడూలేంది యీ రోజు పాలలో నీళ్ళు పోసి తెచ్చావేమిటీ?'' అని అన్న వెంటనే నందుడు, ''ఆ గణేశుడి సాక్షి! నేను పాలల్లో నీళ్ళు పోసి తేలేదు. ప్రమాణం

20. గజానన పండితుడి కథ




చేసి చెపుతా!'' అని గొంతెత్తి బోర విరుచుకుని అరిచాడు.

గజానన పండితుడి దగ్గర ఎంతో వినయంగా ఉండే నందుడు, అంత నిర్భయంగా అరవడం చూసి ఆశ్చర్యపడుతూ వీధిలోని వాళ్ళు నలుగురూ వచ్చి మూగారు. వీధిని పోతూన్న వాడల్లే వెళ్తూన్న స్వరకేసరి ఆగి దూరంగా నిలబడిపోయి లోలోపల ముసిముసిగా నవ్వుకొంటూ చూడసాగాడు.

గజానన పండితుడు చిరుకోపంతో కనుబొమలు ముడిచి, ''నందా! ప్రమాణం దాకా వచ్చావు? ఏదీ ప్రమాణం చెయ్యి చూద్దాం!'' అని అన్నాడు.

ప్రమాణం చేయవలసివచ్చేసరికి జంకుపుట్టి నందుడు తటపటాయిస్తూంటే, ''అలా దిక్కులు చూస్తావేం?'' అంటూ గజానన పండితుడు కంచుఘంటలాంటి కంఠధ్వనితో, ''ప్రమాణం చెయ్యవేం మరి?'' అని గద్దించగా నందుడికి మరింత దిగులు పట్టుకొంది.

దూరంగా ఉన్న స్వరకేసరి పెద్ద మనిషిలాగ ముందుకు వచ్చి, ''అనగానే సంబరమా, చెయ్యరా నందా చెయ్యి! చెప్పింది సరిగ్గా చెప్పి, దీపం ఆర్పి, భయపడతావెందుకు!'' అంటూ నిబ్బరం చెప్తూన్నట్టు కనుసైగ చేశాడు.

నందుడు సగం ధైర్యం తెచ్చుకొని, ఎదురుగా గదిలో స్వర్ణగణేశ ప్రతిమ దగ్గిర వెలుగుతున్న దీపం ముందుకెళ్ళి నిల్చుని, భయంభయంగా హీనస్వరంతో, ''నేనేగాని పాలల్లో నీళ్ళు పోసి తెస్తే, నా రెండు చేతులూ పడిపోవాలి! లేదా అలాగ అన్న గొంతుకే పడిపోవాలి!'' అని చెబుతూ, దీపం ఆర్పేస్తూ గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

గజాననుడు కొయ్యబారిపోయాడు. అతని గొంతు బిగుసుకుపోయి మాట రాలేదు.

''అయ్యో! ఎంత పని జరిగింది!'' అని నలుగురూ విచారిస్తూంటే, ''ప్రమాణ



కాలు చేయించడం అంటే మాటలా మరి!'' అని అంటున్న స్వరకేసరి గొంతు విని నందుడు కళ్ళు తెరిచి, తన చేతుల కేమీ కానందుకు ఆనందపడుతూ, గబ గబా స్వరకేసరిని చేరుకున్నాడు.

ఆ సమయంలో బాలగణేశభట్టు పరు గెత్తుకుంటూ వచ్చి, ''తాతయ్యా! బండి దిగి ముందు నేను పరుగెత్తుకుంటూ వచ్చేశా! అమ్మమ్మా వాళ్ళంతా బండి మీద వస్తున్నారు!'' అని అంటూ తాత గారిని చూసి నివ్వెరబోతూ, నలుగురూ చెప్పినదంతా విని, పెదవులు బిగించి నడుం మీద చేతులుంచి ధాటీగా నిలబడి, ''నందా, ఆగు!'' అన్నాడు.

స్వరకేసరితో వెళ్ళిపోబోతూన్న నందుడు మంత్రించినట్టుగా తక్కున ఆగిపోయి, గదిలో దీపం వెలుగుతూనే ఉండడం చూసి విస్తుపోయాడు.

''నువ్వు దీపం సరిగా ఆర్పినట్టులేదు, మళ్ళీ ప్రమాణం చెయ్యి!'' అని శాసిస్తు న్నట్టు బాలభట్టు అన్నాడు.

భయంలేదు వెళ్ళి ప్రమాణం చెయ్యి అన్నట్లుగా స్వరకేసరి నందుడి వీపు పొడిచి ముందుకు తోశాడు.

బాలగణేశభట్టు, ''నందా! సరిగ్గా విను, నేనేగాని నీళ్ళల్లో పాలు పోసి యిస్తే, నా చేతులు పడిపోవాలి! అని చెప్పి దీపం ఆర్పు! ఊఁ, త్వరగా కానియ్యి.'' అని హుంకరిస్తూ అన్నాడు.

నందుడికి ముచ్చెమటలు పోశాయి. అతడు గజగజలాడుతూ, ''అయ్యబాబో! నేనీ ప్రమాణకం చెయ్యను. ఈ స్వర కేసరి చెప్పినట్లుగా, నీళ్ళలో పాలు పోసి తెచ్చిచ్చాను. పాలల్లో నీళ్ళు పోయలేదని ప్రమాణం చేశాను, అంతే! నన్ను రక్షిం చండి!'' అని అంటూనే గబగబా వెళ్ళి, నీళ్ళల్లో పోయగా చెంబులో ఉన్న చిక్కటి పాలను తెచ్చి బాలభట్టు ముందు పెట్టి అలాగే మోకరిల్లుతున్నట్టు పడ్డాడు.

అక్కడ చేరినవారంతా గలగలా నవ్వు తూన్న కోలాహలంలో స్వరకేసరి జాడ



లేకుండా పారిపోయాడు. అతని కోసం కొందరు పరుగున వెళ్ళారు.

అప్పుడు గణేశభట్టు నలుగుర్నీ కలియజూసి, "చూశారా! ఈ ప్రమాణకాలు చేసేవారూ, వెనుక దన్నుగా చేయించేవారూ ఎక్కువమంది వట్టి మాయావులు! మాటలు మారుస్తూ సత్యాన్నే తికమక పెట్టే ద్రోహులు. అమాయకుల్ని నమ్మించి మోసం చేసే వంచకులు!" అని అన్నాడు.

"ఔను! చిన్నవాడివైనా బాగా చెప్పావు. కళ్ళు తెరిపించావు!" అని కుర్రవాడి తెలివితేటల్ని మెచ్చుకుంటూ, గజానన పండితుడి గొంతు పట్టు విడిపోయినట్లు తెలుసుకొని, అంతా సంతోషిస్తూ వెళ్ళిపోయారు.

గణేశభట్టు, "తాతయ్యా! ఆడంబరమూ, అహంకారమూలేని పండితుడివైన నువ్వే పామరుడిలాగ, యిలాంటి ప్రమాణాల మాయలో పడ్డావంటే చాలా చిత్రంగా ఉంది కదా!" అన్నాడు.

గజాననుడు బాలుణ్ణి దగ్గరకు తీసుకుని కన్నులు మూసి, "ఔను, గణేశా!" అని అంటూన్న సమయంలో వీధిలో బండి ఆగింది.

గజాననుడు కళ్ళు తెరిచి చూస్తే బాలుడు లేడు; అప్పుడే బండి మీంచి కిందికి గణేశభట్టు దూకడం కనిపించింది.

గజానన పండితుడి ముఖం జ్యోతిలాగ వెలిగింది. "గణేశా!" అంటూ మహానందంతో ఆనందభైరవి ప్రారంభ స్వరంలాగ అరిచాడు.

పావనమిత్రుడు కథ చెప్పడం ఆపి, "పిల్లలూ! ముందు వచ్చిన ఆ గణేశభట్టు ఎవరో చెప్పండి?" అని అనడమే తరవాయిగా, "ఇంకెవరు, మన విఘ్నేశ్వరుడే! వాతాపి గణపతి," అంటూ పిల్లలూ, వారితో పెద్దలూ గొంతులు కలిపారు. పావనమిత్రుడు తిరిగి చెప్పసాగాడు:

"తాతా!" అంటూ గణేశభట్టు చేతులు చాచి పరుగున వస్తూంటే, "గణేశా!"

అంటూ పండితుడు చేతులు చాచి మన వణ్ణి ఎత్తి, "గణేశా! విఘ్నేశ్వరుడు మనల్ని అనుగ్రహించాడు. నీ రూపంలో వచ్చి మన ఇల్లు పావనం చేశాడు. ఇది గజానన మందిరం!" అని అంటూ అరవై ఏళ్ళు నిండిన ఆ వయస్సులో చిన్న పిల్లవాడిలాగ గంతులేస్తూ, "తాండవ నృత్యకరీ గజానన ధిమికిట...." అంటూ ఆనందభైరవి రాగంలో సమ్మోహన గాత్రంతో పాడుతూన్న పాట ఘంటానాదం లాగ నగరమంతటా మార్మోగుతూ వినిపించింది.



ఆ ఆనందపతాక సన్నివేశంలో స్వరకేసరి పరుగునవచ్చి, గజానన పండితుడి పాదాలు చుట్టివేసి తల అన్చి, "గురుదేవా! క్షమించాను అని అంటేగాని మీ పాదాలు వదలను!" అని అన్నాడు.

గజాననుడు తెప్పరిల్లి, స్వరకేసరిని లేవనెత్తి, "స్వరకేసరీ! మనం నిమిత్త మాత్రులం, అంతా ఆ గజాననుడి లీలా విలాసం! నువ్వు సంగీతాన్ని శాస్త్రీయంగా మథించినవాడివి, నేను భక్తికి, మమతకు ప్రాధాన్యం యిచ్చి, భక్తితో కూడినప్పుడే సంగీతం ఉన్నతమార్గం అందుకుంటుందని నమ్మినవాణ్ణి. అంతే! ఇకనుంచి స్వర్ణగణేశ విగ్రహాలు అన్నీ నీ అధీనమే! ఆ సత్కారాలేవీ నాకు వద్దు. ఇటుపైని నేను సభల్లో పాడను!" అని అనగానే గణేశభట్టు, "తాతయ్యా! నీకోసం నువ్వు ఇంట్లో పాడుకొంటేచాలదు. ఎదుటివారిలో మంచి అభిరుచినీ, ఆనందాన్నీ, మమతనీ, భక్తినీ కలిగించినప్పుడేకదా నీ పాటకూ, పాండిత్యానికీ సార్థకత!" అన్నాడు.

గజాననుడు చేతులెత్తి జోడిస్తూ, "ఓ విఘ్నేశా! ఈ మాటలు నా మనవడి నోటితో నువ్వే అంటున్నావు! ఇంతవరకూ నీవు చెప్పినట్లుగానే గానం వినిపించాను, ఇక ముందు కూడా నీ ఆనతి ప్రకారం అలాగే నిన్ను కీర్తిస్తాను. వినేవారి హృదయాల్లో నర్తించు! సత్కారాలు మాత్రం నాకు అందకుండా చూడు!" అన్నాడు.




అప్పుడు స్వరకేసరి, "గురుదేవా! మీరు రచించిన కీర్తనలను మీ రీతిలో పాడినవారికి ఏటేటా స్వర్ణగణేశ విగ్రహం బహూకరింపబడుతుంది; ఆ విధంగానైనా మా భక్తిగౌరవాల్ని మీపట్ల చూపుకో గల అదృష్టాన్ని అనుగ్రహించండి!" అని అంజలిఘటించి అర్థించాడు.

గజానన పండితుడికి అరవై ఏళ్ళు పూర్తి అయిన సందర్భంగా, అతను వద్దంటున్నా ఆనాటి సాయంకాలం వాతాపి గణపతి ఆలయ ప్రాంగణంలో ఏర్పాటైన బ్రహ్మాండమైన మహాసభలో పూలజల్లుల మధ్య షష్ఠిపూర్తి మహోత్సవం వైభవంగా జరిగింది.

గజానన పండితుడు చేతులు జోడించి, "ఎందరో మహానుభావులు సంగీతాన్ని, కవిత్వాన్ని భక్తికి అంకితం చేసి అదే సన్మార్గమని చెప్పారు! వారందరికీ వందనాలు. నేనూ అదే నమ్మాను. అంతకంటే నాలో మరే విశేషమూలేదు!" అని చెప్పి, అనేక రాగమాలికలతో విఘ్నేశ్వరుణ్ణి కీర్తిస్తూ అమృతగానాన్ని వినిపించాడు. ఆనాటి శ్రోతల హృదయాల్లో తాండవించిన విఘ్నేశుడు ఎప్పటికీ అలాగే నర్తిస్తూ ఉండిపోయాడు.

ఈ విధంగా వాతాపినగర చరిత్రలో గజానన పండితుడి పేరు సువర్ణాక్షరాలతో నిలిచిపోయింది, అని పావనమిశ్రుడు ముగించాడు.

ఒకనాడు చాలామంది పిల్లలు వారి వెనుక పెద్దలు గుమిగూడి ఒక చిత్రాన్ని వింతగా చూస్తున్నారు. ఆ చిత్తరువులో ఒక విచిత్రమైన జంతుభూతం చిత్రించబడి ఉంది. అప్పుడే మంటపం ప్రవేశిస్తున్న పావనమిశ్రుడు పిల్లల కుతూహల కారణం గ్రహించి, "పిల్లలూ! ఆ కథ విందురుగాని కూర్చోండి!" అంటూ చెప్ప మొదలు పెట్టాడు:

ఇంద్రుడు సగరచక్రవర్తి యాగాశ్వాన్ని దాచాడు. పృథుచక్రవర్తి యాగం సరిగ్గా పూర్తవకుండా, గుర్రాన్ని దొంగిలించుకు

పోతూ పాషండ వేషాలు వేశాడు, చేయ రాని పనులెన్నో చేశాడు.

పృథుచక్రవర్తి సంతతివాడైన అభి నందను డనే మహారాజు ఇంద్రుడికి భాగం లేకుండా ఉండే ఒక మహాయాగాన్ని ప్రారంభించాడు. ఇంద్రుడు పట్టరాని ఉక్రోషంతో కాలుడిని ఇచ్చకాలతో, సుర భోగాలతో బాగా తృప్తిపరిచి, అభినందనుడి యాగాన్ని ధ్వంసం చేయమని కోరాడు.

కాలుడు కాలానికి అధినేత. జీవుల జీవన మరణాలకు కాలుడే మూలము. కాలుణ్ణి కాలయముడు, కాలధర్ముడు అని కూడా అంటారు.

కాలుడు యజ్ఞపురుషుణ్ణి ఆవహించి, అభినందనుడి యాగ హోమాగ్ని నుండి కనీ వినీ ఎరుగని మహాభయంకరమైన పర్వతంలాంటి జంతుభూతం వెలువడే లాగ చేశాడు. ఋత్విజులు, అధ్వర్యులు మొదలైనవారంతా పారిపోయారు.

అభినందనుడు గణేశభక్తుడు. అతని గురువైన వశిష్ఠుడు, ''రాజా! ఇలాంటి అవాంతరం రావచ్చునని తెలిసే హోమ గుండానికి ఎదురుగా పెద్ద స్వస్తికా పీఠాన్ని వేయించాను. స్వస్తిక గణేశుని సంకేత చిహ్నం. గణేశ్వరునికి ప్రతి రూపంగా పసుపు ముద్దను స్వస్తిక కేంద్రంలో పెట్టి ప్రణమిల్లు! ఆ స్వస్తిక అవాంతరాన్ని నిర్మూలిస్తుంది!'' అని చెప్పాడు.

రాజు అలాగే చేశాడు.

ఆ స్వస్తిక ముగ్గు కేంద్రం నుంచి అద్భుత ప్రకంపనంతో నాదం వెలువడి, అణువులు విజృంభించి పైకెగిసి మహా జంతు భూతాన్ని ఆవరించాయి. అణు వులు పెద్దవిగా పెరుగుతూ ఎలుకలుగా మారాయి. అనేక రంగురంగుల్లో మెరిసి పోతూన్న చిట్టెలుకలు చీమల బారుల్లాగ భూతజంతువు నిండా పట్టుకొని కొరికి కొరికి, బలవంతమైన సర్పము చలిచీమల చేత చిక్కి చచ్చిన విధంగా చేసినై. భూత జంతువు గిలగిలా తన్నుకొని చచ్చినట్లు చచ్చి అదృశ్యమైంది.





# పిరికి యువరాజు

చాలాకాలం కిందట పర్షియాలో ఒక యువరాజుండేవాడు. అతడు అన్నివిధాలా యోగ్యుడే గాని, చంద్రుడికి కళంకం ఉన్నట్టు అతనికి పిరికితనం ఒకటి ఉండేది. యువరాజుకు ఇరవై ఏళ్ళు నిండిన అనంతరం అతని తండ్రి చని పోయాడు. యువరాజుకు పట్టం కట్టటానికి చాలా పెద్ద ఎత్తున సన్నాహాలు జరుగుతున్నాయి.

ఆ దేశంలో ఒక ఆచారం ఉంది. అదేమిటంటే సింహాసనం ఎక్కే ముందు రాజు కాబోయేవాడు సింహంతో పోరాడాలి. యువరాజు కొరకు మంత్రులు ఒక సింహాన్ని తెచ్చి బోనులో సిద్ధం చేసి వుంచారు. పిరికివాడైన యువరాజుకు ఆ సింహం గురించి ఆలోచిస్తేనే చేతులూ, కాళ్ళూ చల్లబడసాగాయి. అందుచేత అతను రేపు పట్టాభిషేకమనగా తన గుర్రం యెక్కి, అర్ధరాత్రివేళ బయలు దేరి, దేశం విడిచి వెళ్ళాడు.

యువరాజు మూడు రోజులు ప్రయాణం చేసి ఇంకో దేశం చేరుకున్నాడు. ఆ దేశం అడవులతో, వనాలతో, నదులతో చాలా అందంగా వుంది. ఒకచోట గడ్డి మేస్తున్న గొర్రెల మంద కనిపించింది. సమీపంలోనే ఒక కాపరికుర్రాడు కూచుని పిల్లనగ్రోవి మీద హాయిగా పాడుతున్నాడు.

యువరాజు ఆ కుర్రవాణ్ణి పలకరించాడు. కుర్రాడు యువరాజును తన యజమాని ఇంటికి తీసుకుపోయాడు. ఆయన యువరాజుకు చక్కగా భోజనం పెట్టి, ''తమరు ఎవరు? ఏ వూరు? ఎక్కడికి పోతున్నారు?'' అని ప్రశ్నించాడు.

''అయ్యా, నేనొక యువరాజును. నా పేరు చెప్పను. పరిస్థితులు అను



కూలించక నేను దేశభ్రష్టుణ్ణి అయాను. ఇప్పుడు నాకొక చోటంటూ లేదు,'' అన్నాడు యువరాజు విచారంగా.

''అయితే, తమరు మా యింటనే ఉండిపొండి. తమకే లోటూ రాకుండా చూస్తాను. ఎప్పటికైనా తమకు మంచి రోజులు రాకపోవు,'' అన్నాడు రైతు.

యువరాజు రైతు ఆతిథ్యం స్వీకరించాడు. అతను రోజూ గొర్రెల కాపరి కుర్రాడి వెంట ఏ అడవికో, ఏ జలపాతం వద్దకో వెళుతూండేవాడు.

ఒకనాడు యువరాజు గొర్రెల వెంట ఒక కొండ కొనకు వెళ్ళాడు. అక్కడికి ఇంకా చాలామంది గొర్రెలకాపర్లు వచ్చారు.

ఈ సమయంలో దూరంనుంచి, ''సింహం! సింహం!'' అని కేక వినిపించింది. గొర్రెల కాపర్లందరూ చేతికందిన రాళ్ళూ, కర్రలూ తీసుకుని కేక వినిపించిన దిక్కుగా పరిగెత్తసాగారు.

''పోయి సింహాన్ని చంపుదాం రా!'' అన్నాడు యువరాజు వెంట వచ్చిన కుర్రాడు. కాని, సింహం మాట వింటూనే, యువరాజు కొయ్యబారిపోయాడు. అతని నోట మాట రాలేదు.

కుర్రాడు క్షణంసేపు చూసి సింహాన్ని వేటాడటానికి తాను కూడా వెళ్ళాడు.

తన అవయవాలు స్వాధీనంలోకి రాగానే యువరాజు తన ప్రాణం రక్షించుకోటానికి చెట్టెక్కి, ఆకుల గుబురు మధ్య దాక్కున్నాడు. కొంతసేపటికి గొర్రెల కాపర్లు కేకలు వేస్తూ సంతోషంగా తిరిగి వచ్చారు. వారు చంపిన సింహం వారి వెంట ఉన్నది.

ఇది చూసిన యువరాజుకు సిగ్గు వేసింది. గొర్రెల కాపరి కుర్రాడికున్న ధైర్యం కూడా తనకు లేదు. చచ్చిన సింహాన్ని చూస్తేనే అతనికి చేతులూ, కాళ్ళూ వణుకుతున్నాయి. గొర్రెల మందలు వెళ్ళిపోయాక యువరాజు చెట్టు దిగి వచ్చి, రైతుకు కనబడటానికి ముఖం చెల్లక మరొకమార్గం పట్టుకుని పోసాగాడు.



మరి మూడు రోజులు ప్రయాణించినాక యువరాజు ఎడారి చేరుకున్నాడు. అక్కడ అతనికొక సైనికుల శిబిరమూ, దానికి సంబంధించిన డేరాలూ కనిపించాయి. ఆ శిబిరానికి నాయకుడైన సేనాపతి యువరాజుకు అన్నపానాలిచ్చి ఆదరించాడు. ఆయనతో యువరాజు తన పేరు చెప్పలేదుగాని, రైతుతో చెప్పినట్టే, తాను దేశభ్రష్టుడైన ఒకానొక యువరాజునని చెప్పాడు.

"తమరు మా శిబిరంలోనే ఒక సైనికుడుగా ఉండండి. ఏ లోటూ లేకుండా చూస్తాము. ఎప్పటికైనా మంచిరోజులు రాకపోవు." అన్నాడు సేనాపతి. యువరాజు అందుకు సమ్మతించాడు.

అతనికి ఇక్కడి జీవితం కూడా బాగానే వున్నది. కాని ఒక రోజున సైనికులందరూ గుర్రాలెక్కి బయలుదేరుతూ యువరాజును కూడా రమ్మన్నారు.

"మీరంతా ఎక్కడికి పోతున్నారు?" అన్నాడు యువరాజు.

"సమీపంలో వున్న కొండలలో సింహాలున్నాయి. వాటిని వేటాడపోతున్నాం. చాలా కాలం యుద్ధంలేని కారణంచేత ధైర్య సాహసాలు మొద్దుబారిపోతాయి. దానికి వేట సరి అయిన విరుగుడు!" అన్నారు సైనికులు సంతోషంగా.

యువరాజు వెళ్ళక తప్పిందికాదు. ఆత్మరక్షణకోసమే సింహంతో పోరలేని యువరాజుకు వాటిని వెతికి వేటాడే సైనికులు అతి సాహసులుగా కనిపించారు.

సైనికులు కొండలలో ప్రవేశించగానే యువరాజు తన గుర్రాన్ని దారి తప్పించాడు. అతను కొన్ని రోజులు ప్రయాణం చేసి ఒక పెద్ద నగరం ప్రవేశించాడు. అతను దేశభ్రష్టుడైన యువరాజని చారుల వల్ల విని ఆ దేశపు రాజు అతనిని తన ఇంటికి ఆహ్వానించి, సాటి రాజుకు జరపవలసిన మర్యాదలన్నీ జరిపాడు. మంచి రోజులు వచ్చేదాకా తన అతిథిగా ఉండమన్నాడు.




ఈ రాజుగారి కొక కుమార్తె ఉన్నది. ఆమె అందగత్తె, తెలివిగలది. దేశభ్రష్టుడైన యువరాజుకు ఏ విచారమూ కలగకుండా ఉండగలందులకై, ఆమె అతని వెంటనే ఉంటూ కబుర్లు చెప్పసాగింది.

యువరాజు ఇక్కడికి వచ్చిన రోజు సాయంకాలం భోజనాలయాక యువరాజూ, రాజకుమార్తే మాట్లాడుకుంటూ ఉండగా, గది వెలపల భయంకరమైన చప్పుడు వినిపించింది.

దడాదడా కొట్టుకునే గుండెతో యువరాజు, ''ఆ చప్పుడేమిటి?'' అని అడిగాడు.

''మరేమీలేదు. నా నల్లబంటు ఆవలింత!'' అన్నది రాజకుమార్తె.

నల్లబంటు అంటే రాజకుమార్తె నౌకరయిన నీగ్రోవాడు కాబోలనుకున్నాడు యువరాజు. మనుష్యమాత్రుడు ఆవలిస్తూ అంత భయంకరమైన చప్పుడు చేయటమూ, బంటు అలా ఆవలిస్తుంటే రాజకుమార్తెకు ఆగ్రహం కలగకపోవటమూ యువరాజుకు ఆశ్చర్యంగానే తోచింది.

మరికాస్సేపు సంభాషించుకున్న తరవాత, ''నిద్రపోయేవేళ అయింది. వెళ్ళి పడుకోండి,'' అంటూ రాజకుమార్తె తలుపు తెరిచింది. మరుక్షణం యువరాజు గుండె ఆగినట్టయింది. అక్కడ పెద్ద నల్ల సింహం కూచుని ఉంది.

''సింహం! సింహం!'' అని ఎలుగెత్తి అరిచాడు యువరాజు.

''భయపడకండి! భయపడితే అరణ్యమృగాలు మీద పడతాయని ఎరగరా? ఇది నా పెంపుడు సింహం! ఏమీ చెయ్యదు. నేనే స్వయంగా మచ్చిక చేశాను. ఎప్పుడూ నా వెంటే తిరుగుతూంటుంది!'' అంటూ రాజకుమార్తె సింహం తల మీద చెయ్యి వేసి నిమిరింది.

యువరాజు కొంచెం స్తిమితపడ్డాడు. తరువాత రాజకుమార్తె నల్ల సింహాన్ని వెంటపెట్టుకుని వెళ్ళిపోయింది.

ఆ రాత్రి యువరాజు నిద్రపోలేదు. తాను బాధపడుతున్నది భయంవల్లనే

తప్పు, సింహాలవల్ల కాదని అతను తెలుసుకున్నాడు. గొడ్లకాపరి కుర్రాళ్ళు సింహాన్ని చంపారు, సైనికులు సింహాలను వేటాడారు, రాజకుమార్తె సింహాన్ని స్వయంగా మచ్చిక చేసింది. వాళ్ళకు భయం బాధ లేదు; తనకున్నది. అంతే తేడా! భయంలేనివాణ్ణి, సింహాలు కావు గదా మరేదీ కూడా ఏమీ చేయలేదు.

ఈ సంగతి తెలుసుకున్నవాడై యువరాజు తెల్లవారకమునుపే తన గుర్రం ఎక్కి ఎవరికీ చెప్పకుండా స్వదేశానికి వెళ్ళిపోయాడు. మంత్రులూ, రాజబంధువులూ సంతోషించారు.

"నేను సింహంతో పోరాడతాను. ఏర్పాట్లు చేయండి!" అన్నాడు యువరాజు. మర్నాడే సింహంతో యువరాజు పోరాటం ఏర్పాటయింది.

యువరాజు బల్లెంతో రంగస్థలంలోకి వచ్చి ధైర్యంగా నిలబడ్డాడు. అక్కడకు సింహం ఉండే బోను తెచ్చి దాన్ని బయటికి వదిలారు.

బోను తలుపు తెరవగానే సింహం పెద్ద పెట్టున అరుస్తూ ముందుకు దూకింది. యువరాజు కదలలేదు, మెదలలేదు. సింహం అతని చుట్టూ తిరిగి, అతని పక్కనే కూచుని, అతని చేతిని నాకింది. అది పెంపుడు సింహం! ఆ సంగతి మంత్రులు యువరాజు దగ్గిర దాచారు. అతడి ధైర్యసాహసాలు రుజువయాయి.

వెంటనే పట్టాభిషేకానికి ఆహ్వానాలు వెళ్ళాయి. రైతుకూ, గొర్రెలకాపరి కుర్రాడికీ, ఎడారిలో సేనాపతికీ, సైనికులకూ, రాజుకూ, ఆయన కుమార్తెకూ కూడా పిలుపు అందింది. వారంతా వచ్చారు.

పట్టాభిషిక్తుడికి అందరూ కట్నాలు చదివించేటప్పుడు రాజుగారు, "నేను వేరే ఏ కట్నాలూ తీసుకురాలేదు. నా కుమార్తెను తెచ్చాను. ఆమెను స్వీకరించు," అన్నాడు.

యువరాజు రాజకుమార్తెను పెళ్ళాడి చాలాకాలం సుఖంగా రాజ్యం చేశాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







T. Narasimha Rao — Devidas Kasbekar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఆగస్టు నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఒకరి కొకరు తోడు

రెండవ ఫోటో : అడవి కితడె రేడు

పంపినవారు : సి. వి. ఎల్. పద్మావతి, హైదరాబాద్-36

బహుమతి మొత్తం రు. 25/–నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# న్యూట్రముల్ 'మొనగాడ'వండి
# బలానికి దారాసింగ్ చెప్పే పాఠాలు

1

**పొడుగును పెంచే కసరత్తు.**
కుడిభుజాన్ని గోడకు ఎదురుగా పెట్టి నిలబడండి. ఊపిరి పీలుస్తూ వేళ్ళ మీద పైకిలేస్తూ, ఎడమ ముంజేతిని పైకి విసరుతూ వీలైనంత ఎత్తుగా గోడను తాకండి. మొందటి స్థానానికి తిరిగివస్తూ ఊపిరి వదలండి. దీన్నే, ఎడమ ముంజేతితో 10 సార్లు కుడి ముంజేతితో 10 సార్లూ చెయ్యండి.



2

పాదాల మధ్య 10 అంగుళాల దూరం వుండేలా నిల్చోండి. ఊపిరి పీలుస్తూ, వేళ్ళ పైన పైకి లేస్తూ, ముంజేతుల్ని, వేళ్లు తలపైకి వచ్చేదాకా వీలైనంత ఎత్తుగా విసరండి. మొందటి స్థాయికి తిరిగి వస్తూ ఊపిరి వదలండి. దీన్ని 10 సార్లు చెయ్యండి.



3

కాళ్ళను తిన్నగా పెట్టి నేల మీద కూర్చోండి. కాళ్ళను వీలైనంత ఎక్కువ ఎడంగా పెట్టండి. ఊపిరి పీల్చే టప్పుడు ముందుకు వంగండి. ఇలా చేస్తూ, ఎడమ మోకాళ్ళకు తగిలేలా పాదాన్ని రెండు చేతులతో తాకడానికి ప్రయత్నించండి. మొదటి స్థాయికి తిరిగి వస్తూ ఊపిరి వదలండి. దీన్నే 10 సార్లు ఎడమ పాదంతో 10 సార్లు కుడి పాదంతో చెయ్యండి.



ప్రతి రోజూ ఒక కప్పు న్యూట్రముల్ తాగి బలాన్ని పొందండి. న్యూట్రముల్ లో మీరు యిష్టపడే సమృద్ధి అయిన అమూల్ పాలు, మేలైన మాల్ట్ ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు ప్రొటీన్లు ఖనిజాలు. అదికూడా చాక్లెట్ రుచితో, తల్లులు తెలుసుకోవలసిందేమిటంటె న్యూట్రముల్ ధర, బోర్న్విటా, బూస్ట్ మాల్టోవాకన్న తక్కువ అని.




అమూల్ వారి
# న్యూట్రముల్



daCunha/GCM/69/82/TL

# బుగ్గలు నిండే ఆనందం...
# బుడగలు తెచ్చే వినోదం!
# న్యూట్రీన్
## బబుల్ గమ్




పెద్ద పెద్ద బుడగతో
పకపకా నవ్వేరు,
చిన్నారి బుడగతో
చిరునవ్వు నవ్వేరు.
పిల్లలూ! మీకు సదా
న్యూట్రీన్ బబుల్ గమ్
ఒక మేటి సరదా!




**[illegible] మిఠాయి యందు**
**ఫలరస పూరిత విందు!**

న్యూట్రీన్ చూయింగ్‌గమ్
ప్రొడక్ట్స్ కంపెని
(ప్రైవేట్) లిమిటెడ్
చిత్తూరు 517 002 (ఆ.ప్ర)

(న్యూట్రీన్ కుందేలు మరియు లోగో
న్యూట్రీన్ కన్ఫెక్షనరీ కంపెనివారి
రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.)

CAS.NC.1.82 TEL.D


Flash
Flash